# brown book

## THE BOOK WAS DRENCHED

# భాగ్యసౌధము



గ్రంథకర్త:
శ్రీ గిర్రాజు రామారావు.



నమ్మాళ్వార్స్
౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి,
పోస్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.



౧౯౩౮

వెల ఆరు అణాలు లేక ఒక షిల్లింగు.

# విషయసూచిక

# భాగ్యసాధము



## ౧

## పునాది



భాగ్యము నైతికజీవనముపై ఆధారపడియున్నది. నీతినియమములు లేనివారికి అదృష్టమెక్కువయట! అనగా మోసము, స్వార్థపరత్వము, దురాశ, కపటముగలవారు వృద్ధిపొందుదురట! మోసము లేనిదే వ్యాపారముసాగదని పలువురు అనుట మనము పెక్కుసారులు వినియున్నాము. ఈవాక్యము కేవలము అర్థములేనిది- నైతికజీవనములోని కొరతను బయటపెట్టుచున్నది. జీవితతత్త్వమును సరిగా అర్థముచేసికొనకపోవుటవలన కల్గిన ప్రమాదము ఇది. జీవితమునకు స్వభావసిద్ధముగా కావలసినవి తెలిసికొనక పోవుటవలన సంభవించిన కథన మిది. మోసములేనిదే వ్యాపారము సాగదని అనువాని జీవితము పునాదిలేకుండ బురదలో ఇల్లుకట్టినట్లే అగును. నైతికము, ఆధ్యాత్మికము రెండునుఒక్కటే. కాని ప్రకృతిలో మనము చూచు వస్తువులలోను, చూడని వస్తువులలోను భేదము కనుపించును. మానవుడు ప్రకృతిలోని వస్తువులను చూచి, వాని కనుగుణముగా సంచరించును. కాని దానిలోని మూలతత్త్వ

మును గ్రహింపడు. కావుననే నైతికముగ పోయినను తుదకు పరాజయమునే పొందుచుండును.

ఆధ్యాత్మికప్రవృత్తి స్వాభావికము. మానవహృదయప్రపంచమున నియ్యది పుట్టియేయున్నది. మహర్షులు మొదలైనవారందరు చెప్పిన నీతులు దీనిని అనుసరించియే యున్నవి. మనకు బయట కనుపించుచున్న ప్రపంచ మంతయు మనమనోఫలకములందు ప్రతిబింబించుచున్నది. ఈ ప్రతిబింబితప్రపంచముయొక్క కనుపించని నీడ ప్రకృతి యను అద్దములో తిరిగి ప్రతిబింబించుచున్నది.

సున్నలో పై అర్ధభాగమునకు క్రిందిభాగమునకు భేదము లేదు. కాని రెండు వేరువిధములుగా తలక్రిందులుగా నున్నవి. అట్లే బాహ్యప్రపంచము, సూక్ష్మప్రపంచము రెండును వేరుచేయబడిన అర్థవక్రములు. రెండును కలసి నప్పుడు సున్నయగుచున్నవి. ప్రకృతియు, ఆత్మయు రెండును ఒక్కటే. రెంటికి విరోధ మెన్నడును లేదు. ఆత్మతత్త్వ మును గ్రహించుకొనలేక మానవుడు తనకుతానే బాహ్య చక్రమునుండి వేఱగుచు అవస్థలపాలగుచున్నాడు. ప్రతి పదార్థముయొక్క సత్యస్వరూపము, మార్పులు మొద లైనవి మనసుయొక్క స్వరూపము, మార్పునుబట్టియే యుండును.

ఏపదార్థమైన తీసికొనుము. సరిగా తెలిసికొన గల్గినచో ఆవస్తువునకు ప్రకృతిలోగల అనుభవమును నీ మనస్సు పొందుచునేయున్నది. ఒకగింజ వేసితిని. అది చెట్టుఅయినది. పూవులుపూసి కాయలుకాసినది. కాయలు తిరిగి గింజలైనవి. అట్లే హృదయక్షేత్రమున ఆలోచన

అను గింజపడినది. చెట్టువలె పెరిగి ఫలించినది. ప్రకృతి కనుగుణముగా మంచిగనో చెడుగనో ఫలములు పుట్టినవి. ఆఫలములు మరల మరియొక మనోక్షేత్రమున వృద్ధిపొందుచున్నవి. గింజ పాతువాడే గురువు—ఆధ్యాత్మికకర్షకుడు—తనకుతానే అనగా తనగింజను తానే మరల తన క్షేత్రమున పాతుకొన్నవాడు. ఆతడు తనహృదయమునకు తానే గురువు. సమయము కనిపెట్టి గింజ పాతవలెను. తగిన సమయ మిచ్చినచో అది తప్పక జ్ఞానవృక్షమయి వివేకప్రసూనములను తాల్చును.

ఒక్కసారి కిటికీలోనుండి వెలుపలికి చూడుము. దూరముగా ఒకచెట్టుమీద పక్షిగూడు కనుపించును. ఆ గూడు పక్షి క్రొత్తగా కట్టుకొన్నది. పడమటిగాలి విసరుచున్నను చెట్టు ఊగుచున్నను గూడు క్రిందపడదు. పక్షిసుఖముగా దానిలోనుండి ఉయ్యాల లూగుచున్నది. ఇందుకు కారణమేమి? ప్రకృతి కనుగుణముగా అది గూడుకట్టుకొన్నది. అందువలన ఆగూటికి బలమెక్కువ. గూడుకట్టుటకు పంగలు చూచుకొన్నది. గూడు గుండ్రముగనే కట్టినది. ఇందువలన బయటకలుగు ఒత్తిడి విస్తారముగా దానికి ఉండదు. ఇది చాల చిన్నవిషయము. అయినను ప్రకృతిలోని సర్వశాస్త్రములు ముఖ్యముగా విజ్ఞాన, గణితశాస్త్రము లిందు ఇమిడియున్నవి. కాబట్టి జీవితమును ప్రకృతి ధర్మానుసారము నిర్మించుకొన్నచో అయ్యది నిష్ఫలము కాదు. ప్రకృతిధర్మానుసారి ప్రపంచములో తరచు కష్టములకుగాని, అవాంతరములకుగాని లొంగడు. గుడిగాని, యిల్లుగాని కట్టుట పక్షిగూడుకట్టుటకంటె కష్టమైనది.

ఇయ్యవి ప్రకృతిలో స్వభావసిద్ధముగా నిమిడియున్న గణిత శాస్త్రప్రకారము కట్టబడినవే. దీనినిబట్టి మానవుడు ప్రాపంచికధర్మముల కెట్లు లొంగియున్నాడో తెలియు చున్నది. స్కేలు, కంపాసు, లెవెలు మొదలగు పనిము ట్లకు లొంగి భవనమును లేపుచున్నాడు.

ఈ విషయములన్నియు చిన్నచిన్నవి. చిన్నవిషయ ములైనను ఇవి సత్యములు, పూర్ణత్వమును బొందినవి- ఇది చిన్నవిషయమే. ఇంతకంటె వేరువిధములేదు. ఎంత కాలము పరిశోధనచేసి మానవు డిది గ్రహించినాడో తెలియదు. నేడు ఆశాస్త్రములకు లొంగి జీవించుచు న్నాడు. మానవజీవితము ఇట్టిశాస్త్రముల ననుసరించియే నిర్మింపబడినది. కాని అది దేనివలన నిర్మింపబడ్డదో అను చిన్నవిషయమును గ్రహింపజాలకున్నాడు. మానవుడు తానెట్లు నిర్మింపబడినాడో, తనజీవితసౌధము నిలువబెట్టు కొనుటకు మార్గము లేవియో తెలిసికొనకయే తనకు తెలి యని యవస్థలపాలగుచున్నాడు. ఇదియే నైతికపతనము.

మనస్సునందు, బుద్ధియందు, కర్మయందు నియ మములకు పునాది వేయబడినది. తెలిసిగాని తెలియకగాని వానిని విడచిన జీవితము వృథాఅగును. ఈ నియమము లను నిర్లక్ష్యముచేయుటచేతనే ప్రపంచమున నింత దుః ఖము సంప్రాప్తించియుండుట. పదార్థములో గణిత మున్నది. బుద్ధిలో, మనసులో నీతియున్నది. గణితము, నీతి వ్యతిరేకములుకావు. అవి ఏకాకారములోని రెండు భాగములు. గణితశాస్త్రనియమములలోనున్నది ఆచార నీతి. నీతివిద్యలో నిమిడియున్నదే గణితశాస్త్రనియమము

లలోని నైజము. ఇది హృదయగోళమున పనిచేయు చుండును.

నైతికవర్తనలేనిదే మానవుని జీవితము రాణించదు. నైతికముగా నిర్మింపబడిన మానవజీవితము దృఢముగా నుండును. ఈజీవనసౌధము కట్టుటకు చాలకాలము పట్టును. సౌధమునకు ఉపయోగించు రాళ్ళసమూహామే సత్కార్మ. మానవుని యేవృత్తియైనను ప్రకృతిలో సత్కార్మకు దూరముగాలేదు. అది నీతినియమములకు కట్టువడిన మరింతదృఢముగానుండును. భాగ్యము చిరకాలము దృఢముగా నుండుటకు నైతికనియమములు తూచా తప్పక పాటింపవలసి యుండును. అప్పుడే భాగ్యసౌధమును కట్టగలము. నిశ్చలమైన సద్గుణము, నిష్కల్మషమైన నైతిక నియమములు ఆసౌధమునకు స్తంభరూపమున నిలచి దానిని కాపాడును. శాశ్వతమైన అదృష్టమును బొందినవారు ఇట్టిసౌధమును నిర్మించిన మహానుభావులే. శాశ్వతమైన అదృష్టమనగా కొన్నివందల తరములవరకు నిలబడు భాగ్యము.

వ్యాపారమును నిలబెట్టుటనుగూర్చి మానవులు నిరంతరము తలంచుచుందురు. ఇదికూడ ఒక భవనమును నిలబెట్టుటవంటిదే. నిలబెట్టునదేదియైనను నీతిపై ఆధారపడియున్నది. భాగ్యము (అదృష్టము) ఇంటికప్పువలె మానవుని కాపాడును. ఆఇంటికప్పు స్తంభములపై ఆధారపడియుండును. ఆ స్తంభములు పునాదులపై ఆధారపడియుండును. మంచిపునాదులపై లేచిన ఈక్రింది ఎనిమిది స్తంభములు భాగ్యసౌధమునకు అత్యావసరములు.

౧. శ క్తి, ౨. పౌరుష, ౩. శుద్ధి, ౪. క్రమపద్ధతి, ౫. సానుభూతి, ౬. సహృదయత, ౭. నిష్పక్షపాతము, ౮. ఆత్మవిశ్వాసము.

ఈ నై తికనియమములపై కట్టబడు భాగ్యసౌధ మున కేయాటంకమును కలుగదు. వీనిలో నే స్తంభము బలహీనమైనను భవనము ప్రమాదస్థితిలోనుండును. అన్ని యు మంచిపునాదులపై నిలబెట్టబడినచో మరింతదృఢ ముగా నిలబడియుండును.

ఈ నియమములు కల ఒకడు ఒకసంస్థకు అధికారి గానున్నాడని యనుకొనుము. ఆసంస్థ అతనికి తెలియకుం డగనే అభివృద్ధిచెందును. ఏనియమములచే నియ్యది అభి వృద్ధియగుచున్నదో మనము తెలిసికొనజాలము. సామా న్యనై తికనియమములు తెలిసికొననివాడు తనసంస్థను వృద్ధిచేయజాలడు. తుదకు నైతికజీవనమే తన్ను చెరచు చున్నదని తలంచును. కాని తననైతికనియమము లింకను వృద్ధిపరచుకొన్నచో సంస్థ ఇంకను అభివృద్ధిజెందునని అతడు తెలిసికొనజాలడు.

పై నవివరించిన ఎనిమిది నియమములు మానవుని జీవితములోని ప్రతికార్యమునందును తోడ్పడుచు వాని భాగ్యసౌధమునకు స్తంభరూపమున నిలబడియుండును. ఇవి ఏరూపములోనున్నను తగిన శక్తిగలవి అయ్యేయున్నవి. శక్తిమంతములైన ఆనియమములను పాటించినప్పుడే మా నవునకు జీవనసంగ్రామమున విజయము చేకూరును. ఇట్టి విజయమును సంపాదించిన మహానుభావులు చాలతక్కువ. అట్లు సంపాదించినవారు మనకు గురువులు, మార్గదర్శ

కులు, సంఘసంస్కర్తలు; వారు మానవప్రపంచములోని మహాత్ములు. నైతికనియమములగూర్చి సంపూర్ణజ్ఞానము సంపాదించలేక భాగ్యసౌధమును కొంతవరకు మాత్రమే కట్టుకొనువారు కొందరుందురు. కాని వారు తక్కిన నియమములలోగూడ సంపూర్ణత్వమును బొందుట కవకాశ మున్నది.

మానవుని నైతికజీవనమునకు మేర విజయరేఖ. కాబట్టి జయాపజయములు నైతికజీవనముపై ఆధారపడి యుండును. భాగ్యసౌధము నైతిక స్తంభములపైననే నిలబడియున్నది. స్తంభములబలమే సౌధమునకు బలము. అది లేనిచో సౌధము కూలుట నిజము.

పైకి రాయివేసిన క్రిందపడును. అట్లే మనము చేయు ప్రతికార్యము - మంచిదికాని, చెడ్డదికాని - తిరిగి మనమీదికే వచ్చును. దుష్కార్యములు మన సౌధము పైనపడి దానిని కూల్చును. సత్కార్యములు మనసౌధ స్తంభములకు బల మెక్కించును. అంతియేకాదు. భవనమును సుందరముగాచేయును.

మానవులు, కుటుంబములు, మతములు నైతికముగ పతనముపొందనంతకాలము అభివృద్ధియగుచునే యుండును. మానసికముగా, శారీరకముగా నీతినియమములకు కట్టుబడినవాడే చిరకాలము నిలబడును.

అవినీతి శూన్యపదార్థము. దీనినుండి ఏమియు వెలువడదు. ఇది ప్రకృతినికూడ తిరస్కరించును. అవినీతి వినాశకారకము. వస్తునిర్మాణమునే తిరస్కరించును. అవినీతి ఆధ్యాత్మికశక్తుల వెలితిచేయును. ఈవిధముగా అవినీతి

యవస్థపడి అదృశ్యమగును. అదృశ్యమగుచు దాని యను
భవమును కొంత విడచిపోవును. దానినుండి సత్యమును
గ్రహించువాడు సూక్ష్మగ్రాహి. అతడు చెప్పినది ధర్మ
శాస్త్రము.

అవినీతికి వ్యతిరేకము నీతి. దీనిలో ప్రకృతిధర్మము
లిమిడియున్నవి. అట్టి నైతికోన్నతియే మానవుని వంశము
లను నిలువబెట్టును—నిలువబెట్టెను. నీతి నిశ్చలమైనది.
అపజయ మెన్నడు దీనికి కలుగదు. విజయము సత్యము.
యుద్ధములేనిదే విజయముండదు. జీవనోపాధికి పాటుపడు
టయే యుద్ధము. ఈయుద్ధములో మానవుడు పరీక్షింప
బడును. ప్రపంచములో దేనినైనను భరింపశక్తిగలది
ఇనుము. ఇది ఒక ఆకారమును బొందుట కెన్నిసారులో
కమ్మరిచేతిలో పరీక్షింపబడుచున్నది. ఇటికకూడ అంతియే.
కాబట్టి శాశ్వతవిజయమును పొందినవా డెన్నియోకష్ట
ములకు, పరీక్షలకు లోనైయుండును. ప్రతిమానవునకును
ఈపరీక్షగలదు. అనేకవిధములగు విషయవాంఛల నుండి
బయటపడువాడు భాగ్యసౌధమును కట్టుకొనుచున్నాడు.
నైతికపతనమును బొందువాడు ఊరుపేరులేక పోవు
చున్నాడు.

నీతినియమములులేనివాని కెప్పుడును అపాయమే.
అతనికికూడ భాగ్యమబ్బుచున్నట్లనుపించును. కాని పత
నము నిశ్చయము. జేబునిండుగా బంగారము నింపుచుం
డును కాని జేబుకు చిల్లియుండుట కనిపెట్టడు. నైతికోన్న
తికై పాటుపడనివాడు ప్రథమపరీక్షలోనే పడిపోవును.
అట్టివాడు ఎండకు పగిలిన పచ్చియిటికవలె త్రోసి

వేయబడును. అయినను మానవుడు మరల ప్రయత్నించుట కవకాశమున్నది.

నైతికశక్తియే విజయమునకు జీవము. ఇదియే భాగ్యోన్నతిలోని యంశము. విజయము లనేకవిధములు. మానవుడు తప్పక ఒకదానిలోనయినను పరాజయమును బొందును. కాని మరియొకదానిలో అఖండవిజయమును బొందుననుటకు సందేహములేదు. విద్వాంసుడు, కళా ప్రపూర్ణుడు, ఆధ్యాత్మికతత్త్వవేత్త ధనసంపాదనమునకు వెడలిరనుకొనుము. విద్వత్తు నభివృద్ధిచేసికొని యాదర్శ పురుషుడగుటయా లేక ధనవంతుడగుటయా? రెంటిలో నేదియో ఒకటిమాత్రమే వారికి సిద్ధించును. షేక్సిపియరు వాఙ్మయమునుగాని, బుద్ధుని యాత్మతత్వమునుగాని కోట్లు ఖరీదిచ్చి బేరముచేయగలవారుకలరు, వారు చౌకబేరము చేసితి మనుకొందురు. కాని ఆధ్యాత్మికతత్త్వముతో ధనమును బోల్చలేము. ఈరెంటికిని సంబంధములేదు. ఆతత్త్వమునుగూర్చి ఇప్పుడు వ్రాయుట నాపనికాదు. ప్రతిమానవునకును సుఖము, సంతోషము, క్షేమము కలుగు పద్ధతులను మాత్రమే వ్రాయుదును. అవి కలిగిననాడే మానవుడు భాగ్యవంతుడు. ఈభాగ్యము ధనముతోకూడియున్నదే. భాగ్యమున్నవాని మనసు శాంతముగాకూడ నుండవలెను. శాంతములేనిదే సౌఖ్యములేదు.

ఇప్పటికి భాగ్యసౌధమునకు పునాది తయారైనది. ఇక స్తంభనిర్మాణమునకు కడంగుదము.

---

## ౨

# శక్తి

భాగ్యసౌధమునకు మొదటి స్తంభము శక్తి.

ప్రారంభించిన కార్యమును తుదివరకు కొనసాగించు బలమే శక్తి. బొగ్గుకు నిప్పుఅంటించిన మండును. దానిపై నీరు చల్లిన ఆవిరియై నిప్పు ఎగిరిపోవును. ఆవిధమగు అగ్నియే శక్తి. మందమతినిగూడ లేవదీయగల బలము దీనికున్నది.

శక్తి అనునది నైతికనియమము. దీనికి వ్యతిరేకము సోమరితనము. శక్తి ఒక సద్గుణము. దీనిని అభివృద్ధి చేయవచ్చును. సోమరికూడ సాధనవలన బలవంతుడగును. సోమరి చేతకాదను సమయములో శక్తిమంతుడు చేయుచున్నాడు. సోమరి చేయలేనిపనినికూడ శక్తిమంతుడు చేయగలుగుచున్నాడు. సోమరి నిద్రలేవకపూర్వమే చురుకుగలవాడు కొంతపనిని పూర్తిచేయును. సోమరి అనుకూలసమయమునకు వేచియుండును. శక్తిమంతుడు నిశ్చలబుద్ధితో ప్రారంభించి సమయమును అనుకూలముగ చేసికొనును.

శక్తి ఆదిశక్తులలో ఒకటి. ప్రతికార్యమునను ఇదియే మొదటిమెట్టు. సృష్టియంతయు శక్తినుండియే పుట్టెను. మానవునియందున్న శక్తియే జీవము. ఆశక్తిని వినియోగింపనివానికి జీవములేదు, ప్రపంచమేలేదు. మానవుని శరీరములోని ఇంద్రియములు పనిచేయనప్పుడు

అతడు మరణించెనని చెప్పుదుము. సోమరి ఇంతకంటె ఘనుడుకాడు. మనుష్యుడు శారీరకముగా, మానసికముగా పనిచేయుటకే నిర్మింపబడెను. నిద్రపోవుటకు కాదు. శరీరములోని ప్రతి అవయవమును పనిచేయుటకు తగినట్లుగనే నిర్మింపబడినది.

సోమరికి సుఖములేదు. స్వాతంత్రములేదు. శాంతములేదు. భాగ్యమంతకంటె లేదు. సోమరి తనపనిలో చాల కష్టపడునని శాస్త్రము. ఎందువలననగా అతని పనిలో క్రమవిధాన ముండదు. మానసికశక్తి, బుద్ధిచాతుర్యము ఉండదు. తుదకు సోమరి కఠినావస్థలపాలగును.

ప్రారంభించిన కార్యమును విడువనివాడు ధీరుడు. ఆకార్యఫలము మంచిదిఅయిననుసరే చెడ్డదిఅయిననుసరే. సత్కార్యములకు ధీరత్వమును బొందినచో, కార్యఫలము వలన నతనికి సుఖము చేకూరును. చెడుకార్యములకు ధీరత్వమును బొందువాడు తనకుతానే ముప్పు తెచ్చిపెట్టుకొనును. గట్టిగా గోడను గుద్దినచో చేయి విరుగును.

శక్తిని చెడుగా ఉపయోగించుటకంటె శక్తి లేకుండుటయే మంచిది. చెడుగాఉపయోగించుకొనువానికి ఒక లాభమున్నది. దుర్మార్గవర్తనమువలన, అసూయవలన, స్వార్థపరత్వమువలన కష్టములపాలై తుదకు అతడు తన తప్పు గ్రహించి పశ్చాత్తాపపడి సన్మార్గుడగును. అప్పటి నుండియు అతడు మనోచక్షువులను తెరచును. తనశక్తి ప్రవహించుటకు క్రొత్తకాలువ లేర్పరుచుకొనును. ఇదివరకు ఈర్ష్యయందు తగిలియున్న దృఢత్వము మంచిగా మారును. "అమితపాపము లొనర్చువాడు గొప్పయోగి

కాగలడు.” అని శాస్త్రము.

మనోబలము దృఢమైనది. శక్తిమంతమైనది. దృఢత్వములేనిదే సద్గుణమబ్బదు. పాపముచేయనంతమాత్రమున సద్గుణము కానేరదు. మంచిచేయుటయే సద్గుణము. ప్రయత్నించి తగినబలములేక తలచినకార్యమును నడుమను విడచువారుకలరు. వారు ఇతరులకు అపాయమును కూర్చువారుకారు. సాధారణముగా మంచివారే తమ పనులలో అపజయమును బొందుచుందురు. మంచివారు చెడుచేయగలశక్తిమంతులైనను మంచికే వారికాలము వినియోగింతురు. దృఢసంకల్పశక్తిలేనిదే నైతికశక్తి యేర్పడదు. ఏర్పడియున్నమంచి కొంచెమైనను దృఢసంకల్పశక్తిలేనిచో అదృశ్యమైపోవును. అప్పుడు శక్తిలేక యంత్రము ఆగిపోవునట్లు మానవయంత్రముకూడ ఆగిపోవును.

బాహ్యప్రపంచములోగాని, సూక్ష్మజిజ్ఞాసలోగాని, తదితర యేవిధమైన కర్మలలోగాని విజయమునకు దృఢసంకల్పశక్తియే మూలకారణము. యుద్ధవీరులకుగాని, ఇంజనీయరులకుగాని, వ్యాపారులకుగాని, మఱియెవ్వరికిగాని కావలసిన దిట్టిశక్తియే.

ఎల్లప్పుడును మెలకువగా నుండవలెనని పెద్దల యుపదేశము. ఇది యోగిమొదలు వ్యాపారివరకు ఇచ్చెడి సలహా. మెలకువలో జాగ్రత్తయు, చురుకుతనమును ఉన్నవి. ఈగుణములుకలవానికి స్వాతంత్రమెక్కువ. స్వాతంత్రమే మానవునిపరమావధి. అధికశక్తిని సంపాదించుటకు తనలోగల శక్తినంతయు వినియోగింపవలెను. శక్తిని విని

యోగించుటలో మానవుడు నిగ్రహముకలవాడై యుండవలెను. 'శక్తినిగ్రహము' అనునది ప్రకృతినుండి సంగ్రహింపబడినదే. శక్తి ప్రకృతినుండి అనవసరముగా ఖర్చుకాదు. కార్యతత్పరతలో శక్తిని వినియోగింపవచ్చును. అనవసరసంభాషణ, తొందర ఇవి శక్తిని తగ్గింపజేయును. అమితమగు తొందర, కార్యమున జంకు మంచివికావు. హడావిడిలో కార్యము శూన్యము. పని చేయుచున్న ఆవిరియొక్క శబ్దము మనకు వినబడదు. ఆవిరి బయటకు పోవునప్పటిశబ్దమే మనకు వినబడును. బాగుగా దట్టించినమందే తుపాకీగుండును వేగముగా పంపగలదు. కాబట్టి శక్తిని నిగ్రహించియుంచిన వారికి శక్తి అధికము కాగలదు.

లోతు ఎక్కువగానున్న నీరు నిలకడగా నుండును. శాంతస్వభావ మెక్కడగలదో అచ్చట శక్తి యెక్కువగా నుండును. శాంతము, శక్తి, క్రమపద్ధతి అనుభవమును సూచించును. శాంతము కలవాడు తనపనియందు దృఢత్వమును బొందియుండును. ఆతడు మితముగా మాట్లాడును. అతని యాలోచనలు చక్కనిపద్ధతిలో నుండును. అతడు దూరదృష్టిగలవాడై యుండును. కనబడునంతవరకు బాట సరిగా చేసికొనును. విరోధిని సయితము మిత్రునిగా త్రిప్పగలడు. విరోధిచేతనే సేవచేయించుకొనగలడు. అతనికి విషాదముండదు. గాబరాఉండదు. అతనికంటె మనము ముందంజవేయుచున్నా మనుకొందుముకాని ఒక్క నిమిషములో మనలను ఆతడు మించిపోగలడు. ఆతనిని ఏవిధముగానయినను దూషింపుము. కాని అతని చిన్న

సమాధానమువలన నీకోపమంతయు మాయముకాగలదు. అతనిని తిట్టుము. కాని అతని దీనమైనచూపు నిన్ను మరల్పగలదు. అతడు జీవితములోని యన్ని అవస్థల నెదుర్కొనునట్లే మానవులందరిని ఎదుర్కొనగలడు.

శాంతము, సహనము ఇయ్యవి శక్తినిగ్రహామువలన కల్గినవే. ఈశక్తికి వెనుకనే ధీశక్తియున్నది. ఉద్రేకములో, తొందరలో నయ్యది మాయమగును. మాయమైనట్లు అతనికి తెలియదు. శాంతము, సహనము అలవఱచుకొన్న ప్రక్కయింటివాని అభివృద్ధినిగూర్చి అతడు చకితుడగును.

కాబట్టి శక్తిగల మానవునకు భాగ్యసౌధమును గట్టుకొనుట సులభము. శక్తిలేనిచో నిండులేదు. నిండులేనిచో ఆత్మగౌరవము, స్వాతంత్ర్యము ఉండదు. ఉద్రేకభావము నేడు పెక్కుమందిలో కనుపించుచున్నది. చెడు అలవాటుల కలవడి ఇరుగుపొరుగువారితో నిచ్చకములాడుచు తీరికగా ఉద్యోగమునకు యత్నించువానికంటె కష్టములకు లోనయి శ్రద్ధతో ప్రయత్నించువానికి త్వరలో ఉద్యోగముదొరకును. పనిలో ఆసక్తిగలవానికి పనిదొరకితీరును. లేదా అతడే పనిని కల్పించుకొనును.

సోమరికి ఉద్యోగమన్న ప్రాణభయము. పని తప్పించుకొనుటనుగూర్చియే అతడాలోచించుచుండును. బీదలను భాగ్యవంతులుగాచేయ ప్రయత్నించు సామ్యవాదులుకూడ సోమరిని తరిమివైచి అతనిని నిరుద్యోగసైన్యమున చేర్చుచున్నారు.

శక్తి ఒకేవస్తువుకాదు.

౧. క్రమబద్ధమైన చురుకు, ౨. ధీశక్తి, 3. పరిశ్రమ, ౪. తత్పరత అనుగుణములయొక్క సమ్మేళనము.

మొదటిది క్రమబద్ధమైన చురుకు. క్రమబద్ధుడై పనిచేయువానియందు లోకమునకు నమ్మకమెక్కువకల్గును. వానికి నియమించిన పనియందు ప్రమాదముండదని లోకము ధైర్యము వహించును. క్రమబద్ధుడగు అధికారి వలన కార్యకర్తలకు సుఖమెక్కువ. రోజురోజు పనిని తలాయించువాడు కాలమునకు వెనుకబడిపోయి ఇతరులకు ఆటంకము కలిగించుచుండును.

రెండవది ధీశక్తి. మంచిచెడ్డలను నిర్ణయింపగల పరిశోధనశక్తియే ధీశక్తి. తెలివికి, విజయమునకు, స్వతంత్ర మునకు మిక్కిలి తోడ్పడున దిది. ధీశక్తిలేనివాడు మూర్ఖుడు, మూర్ఖునకు భాగ్యమబ్బదు. మూర్ఖుని బుర్రలో అనేక విధములగు ఆలోచనలు తిరిగితిరిగిపోవుచుండును. ఏదియును నిర్ణయింపజాలడు. ప్రపంచములోని ప్రతివిషయము తనకే కావలయునని కూర్చుండును. చేయకూడనిదేదియో తెలిసికొనవలెనన్న ఇతనినిచూచి తెలిసికొనవచ్చును. మూర్ఖునకు సంఘమర్యాద కలుగదు.

జీవితములో చిన్నచిన్న విషయములను తెలిసికొన లేకపోవుటయే మానవుని మెదడు గట్టిదికాదనుటకు నిదర్శనము. ఆలోచనలేకపోవుటనే మెదడులేదని చెప్పుదురు. సొంతవిషయములో ఈమూర్ఖత కల్గియున్న అయ్యాది క్రమముగా సంఘములోనికి ప్రాకగలదు. అతనితో సంబంధమున్న ప్రతివానికిని అతని మూర్ఖత అబ్బుట కవకాశమున్నది. దీనివలన కొంతకాలమునకు అతని భాగ్యమును, సుఖ

జీవనమును పురుగుముట్టినట్లగును.

కాబట్టి ప్రపంచమునకు మన మేవిధముగా నిత్తుమో ఆవిధముగానే మనకు దొరకునని తెలియవలయును. మంచికి మంచి. చెడుకు చెడు. దుర్గుణమువలన చెడుపేరు- అపజయము- మంచిగుణమువలన అధికశక్తి-విజయము. మనపనికి జగమంతయు చేయూత ఒసంగును. దుర్గుణముకలవాడు తాను తప్పి ఇతరులను దూషించును. బుద్ధిమంతుడు తన్ను తా దిద్దికొనగలడు.

మూడవది పరిశ్రమ. పరిశ్రమవలన సుఖముగలదు. ధనలాభముకలదు. కాని వారందరు అధికభాగ్యవంతులు కాలేరు. అయినను తమకున్నంతలో అమితానందమును బొందుదురు. కాబట్టి వారు నిజమైన భాగ్యవంతులకంటె భాగ్యవంతులే. చురుకుగా పనిచేయువారికి తమ కష్టములనుగూర్చి చింతిల్లుటకు సమయముండదు. అరిగినకొలది లోహమునకు కాంతివచ్చునట్లు పరిశ్రమలో నలిగినకొలది మానవునకు కీర్తి హెచ్చును. సంతోషము హెచ్చును. ప్రకృతిలో గ్రహింపవలసిన జ్ఞానమెంతకలదు? ప్రపంచమునకు తానుచేయవలసినపని యెంతకలదు?మానవునిజీవితమెంతయున్నది? ఇట్టిస్థితిలో 'కాలము గడపుట' అనుపదమున కర్థము లేదు. అనుదినము హృదయములో, బుద్ధిలో, మెదడులో ఇమడ్చవలసిన విషయము లనేకములు. అయ్యవి గ్రహించుకొని తిరుగువానికి కాలము నిజముగాచాలదు. పరిశ్రమవలన ఆరోగ్యమబ్బును. పనిచేయువారు ఆహారమును, నిద్రను గూర్చిన నియమములు తమకు తెలియకుండగనే పాటింతురు. వారు చాల ఆనందముగా నుందురు.

నాల్గవది తత్పరత. మానవుడు చిరంజీవియైయుండుటకు తత్పరతయే ముఖ్యమని యొకమహానుభావుడు పల్కియున్నాడు. 'మరణించుటకు నాకు సమయములేదని' మాలవ్యా పల్కియున్నాడు. కార్యతత్పరతలో అతనికి మరణభయములేదు. అతనిహృదయము పనిలో మగ్నమై యుండును. చేయవలసినపనికి ఏమాత్రము తక్కువచేసినను అతనికి సంతోషముండదు. అట్టిమనుష్యులు తమ పనులలో, తమ సద్గుణములలో ఆదర్శప్రాయులుగా నుందురు.

ఇప్పటికి భాగ్యసౌధమునకు ప్రథమస్తంభమును కట్టితిమి.

---

# 3
# పొదుపు

భాగ్యసౌధమునకు రెండవస్తంభము పొదుపు.

సృష్టిలో శూన్యస్థానములేదు. దానిలో వృథాగా విడువదగినదియులేదు. ప్రకృతిలోని శక్తి విస్తారముగా వ్యయముకాదు. కుళ్ళుపదార్థముకూడ ఉపయోగింపబడుచునేయుండును. చెడు నెప్పుడును మంచిగాజేయుట ప్రకృతియొక్క స్వభావము. ప్రకృతి చెడును ఇంకను చెడగొట్టదు.

ఇట్టిస్వభావమే మానవునకుండవలసినది. ఇది యొకనీతి. ఈస్వభావముచేత మానవుడు తనశక్తులను దుర్వ్యయము చేయజాలడు.

ధనమును పొదుపుచేయుటకూడ నిట్టిదే. ఇచట ధనము వస్తురూపమున నున్నది. కూడబెట్టినవాడే ధనవంతు డగుచున్నాడు. అట్లే ఆత్మశక్తులను నిలువయుంచిన వాడు బుద్ధిని, తెలివిని, ఉత్తమగుణములను నిలువ చేయ గలుగుచున్నాడు. ఉత్తమగుణములు నిలువయుంచుట వలన శక్తి యధికమగును. అట్లు శక్తి అధికముగా గలవానికి జీవితములో నిజమైనయానందము లభించును.

పిసినిగొట్టుతనము, దూబరదిండితనము ఈ రెంటికిని మధ్యనున్నదే మితము. అధికవ్యయము వృధాయగును. అధికముగా నిలువజేయుట స్వార్థము. ధనముగాని, శక్తిగాని సంపాదించుటలో లక్ష్యముండవలెను. లక్ష్యమునకు గావలసినది "వాడుక". వాడుట నేర్చుకొన్నవానికే శక్తి యధికముగా నుండును.

మనుష్యుడు క్రింది ఆఱింటిని మితముగా నుపయోగించుకొనవలెను. అప్పుడే నిలువ కూడ చేయగలడు.

౧ ధనము, ౨ ఆహారము, ౩ దుస్తులు, ౪ వినోదము: విశ్రాంతి, ౫ సమయము, ౬ శక్తి.

మొదటిది ధనము. ఇది ఇచ్చిపుచ్చుకొనునట్టి పదార్థము. దీనిలో ముఖ్యముగా గమనింపదగినది రాబడికి అనుగుణముగా ఖర్చుపెట్టుట. అధికముగా ఖర్చుపెట్టువాడు ధనవంతుడు కాజాలడు. భాగ్యముతో జీవితమును ప్రారంభించినను త్వరలో బీదవాడగును.

బీదవాడు భాగ్యవంతుడగుట కొకేసారి ప్రయత్నించరాదు. శక్తికిమించిన పనికి పోగూడదు. అతడు జీవితమును క్రిందినుండియే ప్రారంభింపవలెను. అచ్చట తాను

సురక్షితముగా నుండును. ఏలయన అంతకంటె క్రిందు ఆతనికి లేదు. పైనజూచిన నన్నియు కలవు. అనేకులు చిన్న వ్యాపారస్థులు చితికిపోవుటకు దురాశయే కారణము. పెట్టుబడికిమించిన వ్యాపారము నాశించుటయే దురాశ.

రెండవది యాహారము. ఇది శారీరకమానసికబలములకు దోడ్పడును. దీనిలోకూడ మితమున్నది. అమితాహారికి బుద్ధివికాస ముండదు. అతడు జంతువువలె జీవించుచుండును. బాగుగా పనిచేసినవారును, జివితములో నున్న తపదవికి బోయినవారును మితాహారులే.

మూడవది దుస్తులు. ఇయ్యవి శరీరమును కప్పుకొనుట కుపయోగించునవి. వీనివిషయమున అమితవ్యయము వృథాతప్ప మరేమియును లేదు. జీవనస్థితికి మించిన దుస్తులుధరింపరాదు. దుస్తులు పరిశుభ్రముగా నుండవలెను. అపరిశుభ్రత మానవుని క్రుంగదీయును.

నేడు నలువదిచీరెలుగల స్త్రీలు– ఇరువదిరకములు చేతికర్రలుగల పెద్దమనుష్యులు, ముప్పదిజతల చెప్పుల జోళ్ళుగల షోకిల్లాలు ఉండుట నే నెరుగుదును. ఈమహానుభావు లీధనమును మరియొకవిధముగా ఖర్చుపెట్టినచో వారి కేమిలోటుకల్గునో ఊహింపజాలకున్నాను.

దుస్తులు, ఆభరణములు విపరీతముగా ధరించుటలో మనమనసులలోని వెలితి బయటపడును. ఇది నిజమైన నాగరికతను జూపింపదు. విద్యయు, వృత్తియు నీరెండును రంగుబట్టలకంటె మంచిదుస్తులు. రమణీయములగు ఆభరణములకంటె మంచిఆభరణములు.

నాల్గవది వినోదము, విశ్రాంతి. ఇది ప్రతివానికి

నిత్యము అవసరమైనదియే. పరిశ్రమతోపాటు తీరికయు నుండదగినదే. ఇందువలన మనస్సునకు, శరీరమునకును విశ్రాంతికల్గును. విశ్రాంతికి పిమ్మట పని చురుకుగా నడచును. కాని విశ్రాంతికొరకు పనిని ఎగరగొట్టువారు అనేకులు ఉన్నారు. వారు విశ్రాంతి తీసికొనజాలరు. సరిగదా, మనోవినోదమునకై ఏదియో చెడుపనిని కూడ చేయుచుందురు. జీవితమును వినోదముగా త్రిప్పదలచినచో నది తలక్రిందులై పోవును. పరిశ్రమలోని కష్టములను తొలగించుకొనుటకే మనోవినోదము లేర్పరచుకొనవలెను. మనస్సుకు వినోదమును కల్పించుకొనుటయే మనోవినోదము. మెదడుతో పనిచేయువారు ఆటపాటలకు బోవచ్చును. శరీర కష్టము జేయువారు పుస్తకములు చదువుకొనవచ్చును.

నిద్రకూడ విశ్రాంతిలోనిదే. కాని దీనిలో మితముండవలెను. మానవునకు దినమున కెంతనిద్ర కావలెనో మనము లెక్కవేయనక్కరలేదు. దినదినము ఒకగంట చొప్పున నిద్రాకాలమును తగ్గించుకొనుచు వచ్చిన మనకే తెలియును. నిద్రాకాలము తగ్గించుకొలది, నిద్రించుకాలములోని నిద్ర గాఢముగా నుండును. అదృష్టవంతులు ఎక్కువగా నిద్రపోలేరు. నిద్రమత్తులో నున్న వాడెన్నడు అదృష్టవంతుడు కాలేడు.

ఐదవది సమయము. ఇది ప్రతివానికిని సమానముగా ఈయబడినది. ఎవ్వరికి కొంచెముకూడ ఎక్కువగా ఈయబడలేదు. భోగవిలాసములకులోబడి కాలప్రవాహములో గొట్టుకొనిపోవువాడు పురోగామిగా పోవుచున్నట్లు అనుకొనును. ప్రతినిమిషమును జాగ్రత్తగా ఖర్చుపెట్టు

వానికి సమయముచాలదు. ఖర్చుఅయినసమయముతో నత డు తెలివి, మర్యాద, భాగ్యము సంపాదించును. సమయమే ధనమని శాస్త్రము. ఈవిధముగా సమయమే ఆరోగ్యము-బలము- భాగ్యము- జ్ఞానము- మున్నగువచ్చు ప్రతినిమిష మును సద్వినియోగపరుపవలెను. అది గతించినచో తిరిగి రాదు. ప్రతిదినమునందును కార్యక్రమ ముండవలెను. పని చేయుటకుముందు ఆలోచనకు కొంచెము సమయమును విడువవలెను. ముందుగా నిద్రలేచి ఆదినముయొక్క కార్య క్రమము నాలోచించుకొనువానిపని చక్కగా నెరవే రును. వానిమేధాశక్తి యధికమగును. వానికే భాగ్యము బ్బును. ఆలస్యముగా నిద్రలేచుటచే, చేయవలసిన పనులను గూర్చి ఆలోచించుకొనుటకు సమయముచాలక తిని కూ ర్చుండువాని జీవితము రాణింపదు. కాలము పరుగిడుచునే యుండును, అతడు దానివెనుకబడియుండును. అతడే సోమరి. కాలము పోవుచున్నదని గ్రహించి తొందరగా కార్యమున కుపక్రమించును. కాని ఏమి లాభము? క్రమ బద్ధుడై యుండకపోవుటచే నాపనిలో మొదలు, చివర తేలదు. అతనికి మనోవేగ మెక్కువయగును. కార్యమున వెనుకబడును. ఈస్థితిలో అతనికి కోప మెక్కువయగును.

క్రమబద్ధుడైయున్న సంస్థాధికారి తనసమయము లోపలనే పనిని పూర్తిచేసి వెడలిపోవును. కార్యాలయ ములలో సమయమునుదాటి కూర్చుండి పనిచేయువాడు సోమరియని పాశ్చాత్యుల యభిప్రాయము.

ఆఱవది శక్తి. దీనినిగూర్చి వెనుక వ్రాయబడియే యున్నది.

పైన వివరించినవిధమున మానవుడు పొదుపుచేయ కల్గినచో నతనికి జీవితములో తప్పక విజయము చేకూరును. పొదుపు చేయలేకపోవుటయే దుర్గుణము- పై విషయము లేవి పాటింపకపోయినను కామక్రోధాదులను అరిషడ్వర్గము అభివృద్ధియగును. ఇవి యన్నియు మేధాబలమును పాడుచేసి శక్తిని తగ్గింపజేయును. బలవంతునకు శాంత ముండును. బలహీనునకు కోప మెక్కువ- ఈవిధముగా ఒకగుణముతగ్గినచో మరియొక దుర్గుణ మాస్థానము నాక్రమించును. మానవుని పతనమున కిదియే మూలకారణము. రోగములుకూడ వీనివలననే యభివృద్ధియగుచున్నవని యనేకుల యభిప్రాయము.

కొందరు మానవజీవితముయొక్క జయాపజయములు పైవానితో సంబంధించినవి కావనియు, పూర్వజన్మకృతములనియు వాదింతురు. ఈజీవితములో నార్జిన పాపపుణ్యములకు ఫలితములుగూడ ముందుజన్మలోనే కలుగుననియు వారివాదము. ముందుజన్మ లున్నవాయని పూర్వపక్షసిద్ధాంతము లోనర్చుట నాపనికాదు. కాని యొక్కటిమాత్రము చెప్పకతప్పదు. ఉన్నవనుకొనుము. లేవనుకొనుము. మానవజీవితమును మంచిగా మరల్చుట కాసిద్ధాంతము లెట్లు సహాయపడుచున్నవి? మరణముయొక్క మంచిచెడ్డలనుబట్టి జీవితములోని మంచిచెడ్డలను నిర్ణయింపవచ్చునా ?

ప్రస్తుతవిషయము వేదాంతముగాదు. నైతికజీవనమును గూర్చినది. మానవుడు భాగ్యసౌధమును కట్టుకొనువిషయమును గూర్చినది. ఈపొదుపు అనుష్ఠం

భమునకు గావలసిన మరికొన్నిపరికరముల వివరింతును.

౧ మితము, ౨ సామర్థ్యము, ౩ రాబడి, ౪ స్వతంత్రము.

పొదుపునకు ముఖ్యముగా నుండవలసినది మితము. మితములో జీవశక్తు లిమిడియున్నవి. మితముగా నాలోచించు మానవులు తమతమ యరిషడ్వర్గము నణగద్రొక్కి, దురాచారములకు లోనుగాక ఉన్నచో వారికి నిజముగా సుఖము సంప్రాప్తించును.

శక్తినిగ్రహమువలన సామర్థ్యము కల్గును. సామర్థ్యమునకు పై మెట్టు బుద్ధిసూక్ష్మత. సూక్ష్మబుద్ధిగలవారే ప్రకృతిలోని క్రొత్తవిషయములను తెలిసికొనగల్గుచున్నారు. దీనికితోడు లక్ష్యము. ప్రేమించిన పనియందు లక్ష్యములేనిచో నత డాపనిని చేయలేడు. సామర్థ్యముకలవానికే సమాజములో స్థానముండును. అత డచ్చట తన సామర్థ్యముచేతనే ఒక్కొక్కమెట్టు పైకెక్కుచుండును. మంచిపనివాడు తనపనిముట్లతో చక్కగా పనిచేయునట్లు, సామర్థ్యముగలవాడు సూక్ష్మబుద్ధితో పనిచేయును. ఈపనిలో నారితేరినవాడు సుజ్ఞానియగును. అతడు చెడులోనుండియు మంచినే గ్రహింపశక్తికలవాడై యుండును. కొందరీమెట్టువరకు బోజాలక సామర్థ్యముకల్గియు నజ్ఞానములో నుందురు. వారికి ఆత్మవికాస ముండదు. కావున సామర్థ్యము క్రమక్రమముగా నశించును. అట్టివారి కన్నియు తెలిసినట్లుండును. కాని వాస్తవముగా వా రజ్ఞానులు.

జ్ఞానముతోగూడిన సామర్థ్యముకలవానికి ఆదాయ మెక్కువయగును. భాగ్యమున కిదియే కావలసినది. అతని

కనేకపతనములు కల్గుచుండును. కాని తలక్రిందులైనను దీపమువలె ఆతడు పైకివెలుగుచుండును. రాబడికి శక్తికి సంబంధమున్నది. రెంటియందును పొదుపుకల్గియున్నచో శక్తియు, ధనము ఎక్కువగును. దుర్మార్గుడు అన్నిపనుల లోనుజొరబడి యాదాయము నాశించును. కాని శక్తిమంతుడు తనకు ఫలించుదానిలోనే దిగును. ఆతనికి మంచి ఫలము దక్కును.

పుచ్చుగింజ మొలకెత్తదు. జీవనసంగ్రామములో హృదయదౌర్బల్యముకలవానికి విజయము చేకూరదు. అయినను ఆతనికి ఆయువుమెండు. ఏనాటికైనను బాగుపడునేమోయని ప్రకృతి చూచుచునేయుండును. అనగా అతనికి బాగుపడుటకు అవకాశము లున్నవన్నమాట!

రాబడిగలవానికి పతన ముండదు. జీవనదికి ఏభయము లేదు. నీటిమట్టము తగ్గినను పారుదలయుండును.

ప్రతివిషయమునందును స్వాతంత్ర్యసంపాదనమే మానవుని పరమావధి- అతనియాదర్శము. సామర్థ్యమునకు సూక్ష్మశుద్ధి తోడు- సూక్ష్మబుద్ధితో రాబడి- రాబడితో ధార్మికస్వభావము- ఈస్వభావముతో స్వతంత్రత వృద్ధియగును. ఇట్టిస్వాతంత్ర్యమును సంపాదించినవాడే యాదర్శపురుషుడు. అతనికి అనుకరణముండదు. కిట్టదు కూడ. ఇతరులనుచూచి తెలిసికొనుచునేయుండును. ఆతని జ్ఞానపిపాసకు మేరఉండదు. ఆజ్ఞానపిపాసయందును అతడు స్వతంత్రమైన బాటనే పోవుచుండును. ప్రప్రథమమున ఆతనికి గౌరవము కలుగదు. కష్టములకు లోనై యుండును. అతనికి ఆచరణమేగాని బోధనయుండదు. అతని స్వాతం

త్రాలోచనలు అతనియనంతరము వానియంత నవియే బయటపడును. మనయవతారమూర్తులు, గొప్పవైజ్ఞానికులు ఇట్టివారే.

భాగ్యసౌధము తయారగుచున్నది. జ్ఞానశక్తుల నుపయోగించి మిగిలిన స్తంభములకట్టు మహానుభావులకై అది వేచియున్నది.

---

# ౪

# శుద్ధి

భాగ్యసౌధమునకు మూడవ స్తంభము శుద్ధి.

అంతశ్శుద్ధికలిగి, సమస్త జీవరాసులను తనవలెనే చూచుకొనువాని హృదయము విశాలమైయుండును. అతడే గణించిన ధనమును ప్రపంచమున వెదజల్లగలడు. అతడే సద్గుణములుకలవాడు. ఋణములేనివాడు. జీవించియుండగనే మానవజాతికి సాంఘికముగా గాని, ఆర్థికముగా గాని బాకీతీర్చుకొనిపోయిన మహాపురుషుడు.

ఇచ్చిపుచ్చుకొనుట సమానములని సిద్ధాంతము. ధన మెంతయిత్తుమో అంతేపుచ్చుకొనవలెను. ధనమునకు దగ్గరనుంచు కొన్నకాలముతో వడ్డీకట్టుచున్నాము. వడ్డీకి కాలమునకు లెక్కకట్టుచున్నామన్నమాట! మానవునకు కాల మెంతఇచ్చుచున్నదో గ్రహింపజాలము. తిరిగి కాలముతోపల తాము తమ ఋణ మెట్లు చెల్లించుకొనుచున్నారో తెలియదు. ఆర్థికముగా కాలమును ధనముతో

సరిపోల్చుచున్నాము. వాస్తవముగా కాలమునకు దొంగల మగుచున్నాము. కాలమును దొంగిలించుకొని ప్రతిఫలమే మియు నీయుటలేదు. అందువలన కాలము మానవజీవితము నెత్తుపల్లములలో ఈడ్చుకొనిపోవుచున్నది. కాబట్టి ఇద్దరును పరస్పరము దొంగిలించుకొనిపోవుచునే యున్నారు. ఇక మిగిలినది ధనము. ఈధనము దొంగతనము వలన సంపాదించినదేగదా! ప్రతిఫల మీయక అన్యాయముగా సంపాదించినది దొంగసొమ్ము కానిచో కన్నము వేసి ఎత్తుకొనిపోయినసొమ్ము దొంగసొమ్మెట్లగును ?

మనుష్యుడు సంఘములో బ్రతుకవలసినవాడు కాని కస్తూరమృగమువలె అడవులలో తిరుగదగినవాడు కాడు. సంఘములో బ్రతుకవలసినవాడై నంతమాత్రమున తాను చూచునవి యన్నియు తనకొరకేయని తలంచువానికి అన్నియు దూరముగనే కనుపించును. వాటికై ప్రయత్న మెప్పుడు సాగించునో అప్పుడే దుఃఖము ప్రారంభమగును. దురాశలో నతడు నిర్మాణమునకు బదులు తన జీవితమునే విచ్ఛేదము గావించుకొనును.

శక్తికిని, పొదుపునకు తోడుగా నుండవలసినది శుద్ధియు, విశాలహృదయమును. నైతికగుణములు జీవితాన్నతికి తోడ్పడని సమయ మెప్పుడును రాలేదు. సంఘములోనేకాదు ప్రపంచమంతటను నైతికనియమములపై నాధారపడియున్న మానవజాతిని కట్టివేయగల సామర్థ్యము శుద్ధికి ఉన్నది. ఈమాత్మశుద్ధిగలవానిని కదలించుట ఎవ్వరికిని తరముకాదు.

మనస్సు, వాక్కు, శరీరము ఈమూడిటియందు

శుద్ధిఉండవలెనని మనపెద్దలు పల్కియే యున్నారు. శుద్ధి లేకున్నచో విషయవాసన లనెడి సుడిగుండము మానవుని లోగొనుటకు సిద్ధముగానుండును. మనస్సు, వాక్కు, శరీరము ఈమూడిటిలో నేది పవిత్రముగా లేకున్నను శుద్ధిస్తంభము కూలుట నిజము. అధికారిదగ్గర నున్నపుడు చూపినశ్రద్ధ, అతను లేనప్పుడుకూడ చూపవలెను. అట్లు చూపనిచో నతనిధనమును, సమయమును దొంగిలించిన ట్లర్థము.

కొందరు అబద్ధమాడనిదే దినము గడవదని పల్కుదురు. ఇట్టివారి హృదయములందు మాలిన్యమున్నది. అబద్ధమాడుట, దగా ఇవి తప్పుఅని ప్రతివానికిని తెలియును. తనతప్పు తాను తెలిసికొనలేడందురు. కాని యది వాస్తవము కాదు. అంతరాత్మ తప్పును నిరూపించుచున్నది. అది ప్రతివానికిఉన్నది. కాని మానవుని ఉద్రేకములో అంతరాత్మ ప్రబోధము కార్యకారియగుటలేదు. అయినను అది తప్పును నిరూపించి చెవిలో చెప్పుచునేయుండును. తానుచేయునది తప్పుఅని తెలిసికొని అంతరాత్మప్రబోధమును తప్పించుకొనుబుద్ధితో దొంగ రాత్రులందు బయలుదేరుచున్నాడు. చుట్టకాల్చువాడు సభలోనికిపోవునప్పుడు లవంగము నోటబెట్టుకొనుచున్నాడు. వ్యభిచారి దిక్కులుచూచియే కొంపలో జొరబడుచున్నాడు. దుష్టుడు సమర్థించగల శక్తి చూచుకొనియే దుండగము లొనర్చుచున్నాడు.

త్రికరణశుద్ధిగలవానికే ప్రపంచము చేయూతనొసంగును. మూర్ఖుడెవ్వడును అతనిని మోసగించలేడు. వ్యాపారమున నన్యాయములేనిదే వృద్ధిపొందదని పెద్ద

పెద్ద వ్యాపారు లందురు. న్యాయమనునది తెలియకపోవుట వలన కల్గిన నిర్ణయ మిది. ఇట్టినిర్ణయము చేసికొన్న వాడే మూర్ఖుడు. కాని అతడు లోకుల నందరిని మూర్ఖులుగా భావించును. అతడు ఇతరులను నమ్మడు. తుదకు తనను తానే నమ్మడు.

"కొంతవరకైన నమ్మకములేనిదే వ్యాపారము సాగద"ని ఒకడు పల్కియున్నాడు. "కొంతవరకు నమ్మకము" అను పదము 'మోసము' అను పదమునకు మారురూపము. కొంచెము దారితప్పినవాడు పోనుపోను చాల దూరము తప్పిపోవును. 'నేను వానియంత దగా మనషిని కాను' అను పల్కుటగూడ ఆతని స్వార్థపరత్వమును-అందులకై మోసమును తేటపరచును.

మానవులు అన్యోన్యముగను, న్యాయముగను ప్రతివిషయములోను సంచరించుటయే శుద్ధి. దీనిలోనే మనశ్శుద్ధియున్నది. సంఘములోగాని, మరి యేయితర సంస్థలోగాని, వ్యాపారములోగాని మనశ్శుద్ధితోకూడిన నమ్మకమే వెన్నెముక. నమ్మకములేనిదే ప్రపంచ మొక యంగుళముకూడ సాగదు.

అనృతములాడువానికి ప్రపంచమే అనృతముగా కనుపించునట్లు, నమ్మకముకలవాడు సర్వమును నమ్మియే యుండును. ఇతరుల నతడు నమ్మును. అతని నితరులు నమ్ముదురు. ఇతరు లతనిని నమ్మకున్నను, ఇతరులను అతడు నమ్మియుండవలెననియే ముఖ్యోద్దేశము.

మానవునకు ఎదుటివాని గుణముల నలవరచుకొను స్వభావముకలదు. కాబట్టి ఎట్టిసంఘములో తిరుగుచున్న

నాసంఘములోని గుణములు వానికి అబ్బును. మంచివా డెప్పటికైనను దుర్గుణము కలవానిని త్రిప్పగలడు. దుర్గుణముకలవాడు అపరిమితమైన తెలివికలవాడుకానిండు, సద్గుణములు కలవానికి- శుద్ధిబొందినవానికి, వానిపై అధికారముండును. శుద్ధిబొందినవారిలోనుండియే నేతలు, వీరులు బయల్వెడలిరి. కాని తెలివిగలవారిలో నుండి కాదు. మేధాశక్తికలవారు సుఖముగా నుండకపోవచ్చును. కాని ఆత్మశుద్ధికలవానికి విచారమే లేదు.

శుద్ధిబొందినవాడు నాలుగువిధములుగ భాగ్యవంతుడు కాగలడు. మొదటిది జనులందరకును తనయందు నమ్మకమును కలిగించుకొనుట- రెండవది అట్లునమ్మకమును కల్గించుకొని, తనయందే జనులు భారమువైచి యుండునట్లు చేయుట-మూడవది జనులు వానిపై భారము వైచి వానిని అనుసరించి సంచరించుట- నాల్గవది ఈవిధముగా కీర్తివంతుడగుట.

అపనమ్మకము వ్యతిరేకముగా పనిచేయును. అపనమ్మకము జనులలో మొలకెత్తుటచే పలుకుబడి నశించిపోవును. పిమ్మట సంఘములో నతనికి నిలుచుటకు తావుండదు.

శుద్ధికి ఈక్రింద నాలుగును సహాయ మొనర్చుచుండును.

౧. నమ్మకము, ౨. నిర్భయము, ౩. కార్యదీక్ష, ౪. అజేయము.

నమ్మకము విజయమునకు దగ్గరత్రోవ. నమ్మనివాడు దుఃఖించును. నమ్మినవానికి దుఃఖములేదు. శక్తి, మితము, క్రమపద్ధతులు తెలియక నమ్మి పురుషుడు పడి

పోవును. కాని యతడు సంఘమునకు చెరుపుచేయడు. ఆ కష్టదశలో తనహృదయమును నమ్మి తనలో తాను సంతోషించుకొనుచునే యుండును.

అపనమ్మకము భాగ్యమునకు దగ్గరత్రోవయని తెలివితక్కువవారు తలంతురు. అందులకే వారెవరిని నమ్మరు. త్రాగినవారివలె క్షణికానందమునకే వేచియుందురు. కాని రాబోవు కష్టములను తలంచుకొనరు. కూడబెట్టినధనము ఏవిధముగా ఖర్చుఅగునో యతనికి తెలియదు. ఆధనము ఖర్చుఅయి తీరును. తుదకు ఆవంశము దరిద్రము ననుభవించును. కాబట్టి నీతిసంబంధమైన పునాది కలవానిసౌధమునకు చలనముండదు. ఒకవేళ ఏదియైన ఒక స్తంభము బలహీనమై చలించినను, అది గౌరవమును వృద్ధిచేయునదిగనే యుండి, అతని జీవితమును మరింత గట్టిగా జేసికొనుటకు దారిచూపును.

నమ్మకముకలవాడు నిర్భయముగా నుండును. అతని నోటినుండి వెలువడినమాట శ్లేషరహితముగానుండి నమ్మదగినదిగా కనుపించును. అతనికన్ను పరిశుభ్రముగా నుండును. మోసము, కపటముకలవాని కళ్లు సరిగానుండవు-చూపు నిర్మలముగా నుండదు. మాట వంకరటింకరగా నుండును.

నమ్మతగినవాడు తానుచేయవలసినపని పూర్తిచేసిన తరువాత, తనస్వభావమునుగూర్చి భయపడ నవసరము లేదు. అతని వ్యాపారము మొదలైనవి భద్రముగానుండును. అత డప్పులపాలైనను అతనికి ఒత్తిడి కలుగదు. అతడు సాధ్యమైనంతవరకు అప్పులు నిలువయుంచడు. ఉం

చినను వారిఒత్తిడిచే నలిగిపోవు.

అపనమ్మకముకలవానికి భయమెక్కువ. తనపని యొక్క ఫలితమునుచూచి భయపడును. పనిచేయునప్పుడే భయముతో ప్రారంభించును. ఏలయన అది ఇతరులు చూతురేమోయని భయము. అతడు తనజీవితములో ననేక రహస్యముల వెల్లడిచేయలేక వానిమధ్య నలిగిపోవుచుండును. కాని శుద్ధిబొందినవానికి రహస్యము లుండవు. ఉన్నను ఇతరులకు తెలిపి వానిని బట్టబయలుచేసి తనతోపాటు ఇతరులకు దారి చూపగలడు.

నిర్భయుడు ధైర్యముతో జీవితసంగ్రామములో వీరుడై పోరాడి విజయమందును. విజయపీఠము అతని కడకు దిగివచ్చును.

సద్గుణమువలన కల్గిన శుద్ధినుండి వచ్చినదే కార్యదీక్ష. ఒకపద్ధతి యాలోచించి గట్టిపట్టుదలతో పనిచేయుటయే దీక్ష. అతనికి అనుకూలసమయముతో పనిలేదు. అర్ధరాత్రికూడ పనిచేయును. పరిశుద్ధమైనమనస్సుతో కార్యమున కుపక్రమించువానికి దైవసహాయ ముండును. అతనికి ఆపనిలో సరిగా దారి కనుపించుచునేయుండును. ఆదారినేపోయి అతడు విజయలక్ష్మిని చేపట్టగలడు.

శుద్ధహృదయము, దృఢత్వము, దీక్షకలవాడు అజేయుడై యుండును. వానికి పతనముండదు. మేధాశక్తిగాని, వ్యాపారనిపుణత్వముగాని దృఢత్వమును గెలువజాలవు. నైతికశక్తియే అన్నిటికి మించిన శక్తికలది. ఇది అభ్యసించినవాడు ప్రపంచమున పేరెక్కిన మహానుభావులలో నొకడుగా నుండుననుటకు సందేహములేదు.

శ్రీ

# క్రమపద్ధతి

భాగ్యసౌధమునకు నాల్గవ స్తంభము క్రమపద్ధతి.

తొట్రుపాటు, గడిబిడ, గాబరా లేకుండ జరుగుటయే క్రమపద్ధతి. ప్రకృతిలో ప్రతివస్తువును దాని దాని స్థానములో చక్కగా ఏర్పడియే యున్నవి. అందువలననే సృష్టి తొట్రుపాటులేకుండ నడచుచున్నది. ఒకచోట నుండవలసిన దాచోటున నుండనిచో ప్రపంచ మొక్క అడుగుకూడ ముందునకు సాగదు. అట్లే మనుష్యుని జీవితములోకూడ క్రమపద్ధతిలేనిచో వాని జీవితము వృథా యగును.

ఎట్టి కష్టతరకార్యమైనను క్రమపద్ధతితోనే సాధింపబడినది. వ్యాపారముగాని, సాంఘికపరివర్తనముగాని లేక రాజకీయాందోళనముగాని క్రమ పద్ధతితోనే సఫలమైయున్నవి.

క్రమపద్ధతిలేనిమనుష్యులు సమయమును విస్తారముగా వ్యయముచేయుదురు. పనిలో క్రమమున్నవానికి ఆపని సులభముగా నెరవేరెను. కాని యదిలేనివాడు కాలముతో యుద్ధమొనర్చినగాని కావలసిన ఆలోచన దొరకదు. అటుపిమ్మట కార్యమున కుపక్రమించును. కాని కాలయాపన మగుటచే విసుగుపుట్టును. పని త్వరగా పూర్తిచేయుటకు తొందరపడును. తొందరలో త్రొక్కులాడి యలసిపోవును. ఈకారణముచేతనే మనపెద్దలు శుభాదికార్యము

లలో తొట్రుపాటుపడి తుట్టతుదకు ముష్టియుద్ధమునకు కడంగుచున్నారు. వీరికి శక్తి తగ్గిపోవును.

క్రమపద్ధతిగలవారు సమయమును, శక్తిని కాపాడుకొందురు. వారు దేనిని పోగొట్టుకొనరు. అందువలన పోయినవానికై వెదుక నవసరమే కలుగదు. ప్రతివస్తువు తగిన స్థానములోనే యుండును. వారు పెట్టినవస్తువు వారు చెయిపెట్టినవెంటనే చీకటిలోనయినను వారి చేతికి అందును. వారు శాంతస్వభావులై యుందురు. రోషమునకు, ముకోపితనమునకు, పిచ్చియుద్రేకమునకు, ఇతరులతప్పులను వెదకుటకును వారికి సమయముండదు.

చక్కని క్రమపద్ధతిలో ఎంతపెద్దకార్యమైనను సునాయాసముగా చేయవచ్చును. తక్కువ కాలములో సులభముగా పనిని పూర్తిచేయుటచే చూపఱకు ఆశ్చర్యము గలిగించును. క్రమములేనివాడు తొట్రుపాటుపడుచు క్రిందపడి కొట్టుకొనుచుండగా క్రమపద్ధతిగలవాడు పైమెట్టునకు ఎక్కి కూర్చుండును. ఆర్థికప్రపంచములో క్రమపద్ధతి మరింత ముఖ్యమైనది.

సాంఘికోన్నతికి మొదటిమెట్టు క్రమపద్ధతి. కాబట్టి క్రమమను నియమమును పాటింపనిచో అభివృద్ధినే ఆటంకపరచినట్లగును. వాఙ్మయమున జూడుడు, సాహిత్యమున జూడుడు, ఉద్గ్రంథము లెన్నియో తయారయి యున్నవి. ఇవి యన్నియు వర్ణమాలలోని యక్షరముల కూడికయేకదా! క్రమపద్ధతియే కవిత్వమున కందమిచ్చినది! స్వరక్రమమే సంగీతమునకు రసమునుగూర్చినది. పదివరకుగల అంకెలే గణితశాస్త్రమున కాధారములు

కదా! సామాన్యయంత్రనియమములతోడనే అత్యద్భుత మైన యంత్రములను తయారుచేసి విజ్ఞానమును వృద్ధిచే యుచున్నారు.

అయితే క్లిష్టముగానున్న పని క్రమపద్ధతివలన నెట్లు తేలికయగుచున్నది? కష్టతరమైనపని తేలిక ఎట్ల గును? అనేకములగు చిల్లర పనులన్నియు ఒక్క క్రమ పద్ధతిలో నెట్లిమిడిపోవును? ఒక వైజ్ఞానికుడు దుర్భిణీ యంత్రసహాయమున ఖగోళమును పరీక్షింప మొదలిడును. ఆయంత్రసహాయముననే క్రమక్రమముగా తన నిరీక్షణ మును అభివృద్ధిచేసికొనును. అట్లే ప్రతి వైజ్ఞానికుడును.

మతము, రాజకీయము, వ్యాపారము వీనిలో గూడ ఈ క్రమపద్ధతి ననుసరించుటవలననే యవి అభి వృద్ధిచెందును. బుద్ధి, విద్య, యాత్ర, పరిపాలనము వీనిలోగూడ క్రమపద్ధతి యున్నది. క్రమపద్ధతి జీవితమునే ఒక చక్కని మార్గములో పెట్టగలదు. ఒకడు బజా రులో వస్తువులు కొనుటకు బోయెననుకొనుము. బజారు లోని దుకాణములు ఏక్రమములోనున్నవో అక్రమము ననుసరించి తన పట్టీ తయారుచేసికొని ఒకప్రక్కనుండి బయలుదేరినచో త్వరలో సులభముగా నన్నియు కొనగ లుగును. లేనిచో అతడు ఆబజారులో సుమారు పదిసార్లు వెనుకకు ముందునకు తిరుగుచుండును. తుదకు విసుగుపుట్టి బేరములో మోసపోవును.

ఏపని అయినను, ఏవ్యవహారమైనను న్యాయము, శాస్త్రము, ధర్మము, మతము, విజ్ఞానము, రాజకీయము— అన్నియు క్రమపద్ధతిలో నిలిచియున్నవి. వీనిలో క్రమ

విధానము లేకపోలేదు. కాని మనుష్యుడు వీనిని తెలిసి కొనుటలో క్రమము ననుసరింపజాలకున్నాడు. ఒక్కొక్కడు ఒక్కొక్క క్రమము నేర్పరుచుకున్నాడు. కాని అందరును గలసి ఆయుత్తమవిధానము నేర్చికొనుటకు బయలుదేరు త్రోవ ఒక్కటే క్రమపద్ధతి. దీనికి భిన్నము లేదు. ఆదర్శమొక్కటే, త్రోవ ఒక్కటే. కాని మానవుల అభిప్రాయములు మాత్రము భేదము. ఇందువలననే వారికి తొట్రుపాటు- చింత. వీనితో కాలము గడపుటకు మానవుని యాయువు చాలదు. అయినను అతని యక్రమము లోకూడ తుద కొకక్రమ మేర్పడగలదు. అతని అనుచరులు దానిని అందుకొందురు.

ఏమహాకార్యమైనను మొదట క్రమపద్ధతికొరకే ఎదురుచూచియుండును. సంక్షోభముననగాని శాంతిపుట్టదు. భాషనుగూర్చి అలజడిపుట్టిన తరువాతనే ఉత్తమగ్రంథము బయలుదేరును.

విధి, నియమము, క్రమపద్ధతి ఇవి జీవితమును విజయవంతము చేయును. క్రమపద్ధతిలేక పనిచేయువాడు విధిని తిరస్కరించువాడే. నియమము ప్రకారము ఆలోచించనివాని పనులేవియు భాగ్యమునకు తోడ్పడవు. వాని జీవితములో చింత లనేకములుండును. ప్రతి విషయమున నేదియో ఆటంకము కలుగుచుండును. విధిప్రకారము చేయనివాని మనస్సున విద్య మరుగుపడిపోవును.

జీవితము పరుగెత్తుచున్నది, ఈపరుగులాటపందెములో విధి ననుసరింపనివాడు వెనుకపడిపోవును. పరుగెత్తుట నియమప్రకారము అలవాటుచేసికొనువాడు నిత్య

ము పరుగెత్తుట పనిగాగల తపాలారన్నరు కంటె కూడ ముందు పోగలడు. ఏలఅనగా తపాలారన్నరు పరుగులో క్రమము లేదు, ఒక్కటే బండపద్ధతి. ఇట్లే భాగ్యమునకై పరుగిడు ప్రతిజీవియు భౌతికముగా గాని, ఆంతరంగికముగా గాని క్రమపద్ధతి లేని కారణమున వెనుకబడిపోవును. అట్టి వాని పని విచిత్రముగానుండును. పనిచేయుట కుపక్రమించు సమయమున పనిముట్లు కనుబడవు. లేక డ్రాయరు తాళపుచెవి కనుబడదు. పెట్టినచోట కాగితములుండవు. ఏపని పూనుకొన్నను సమయమునకు ఏవియు లభింపవు. అతడు గందరగోళములో మునిగిపోవును. తన్ను తా తిట్టుకొని ఇతరులను తిట్టును. అట్టిసమయమున అతడు జాగ్రత్తగా ఆలోచించుకొన్నచో అతనితప్పు అతనికి తెలియకపోదు.

క్రమము ననుసరించుటవలననే ప్రతివస్తువు లభ్యమగుచున్నది; ప్రతికార్యమును సఫలమగుచున్నది. క్రమక్రమముగా చేయుపనులు ఎన్నడును చెడిపోవు. రాజ్యములిట్లే ఏర్పడినవి. బుద్ధిశాలు రిట్లే వెలసిరి. కొండఎక్కునప్పు డొకేసారిగ మనము పైకెక్కుటలేదు. నిచ్చెన ఎక్కునప్పుడు ఒకొక్క మెట్టు మాత్రమే ఎక్కుచున్నాముగాని ఎగురుటలేదు. చిన్నచిన్న ఇటికలతోనే పెద్దపెద్ద భవనములు తయారగుచున్నవి.

క్రమపద్ధతిలో నీక్రింద నాలుగువిషయము లిమిడియున్నవి.

౧. శీఘ్రము, ౨. యథార్థము, ౩. ఉపయోగము, ౪. గ్రహణశక్తి.

మొదటిది శీఘ్రము. శీఘ్రత సజీవమైనది. దీనికి

వెంటనే విషయము నవగాహనము చేసికొనుశక్తి గలదు. విధిక్రమము ననుసరించువానికి శక్తి యభివృద్ధియగును. జీవితములో క్రొత్తవిషయములను మానవుడు నిరంతరము స్వీకరించుచునేయుండును. విధి ననుసరించువాడు శీఘ్రముగా వానిని స్వీకరింపగలడు. వానివలన నతనికి భయముండదు. అతనికి క్రొత్తలేదు.

ఎవరికైనను కార్యమున జంకుట దుర్గుణమే. జంకు వానికి భాగ్యమబ్బదు సరికదా కొంతకాలమునకు బుద్ధియే చెడిపోవును. కార్యసంసిద్ధత గలవారు, బుద్ధిసూక్ష్మత గలవారు ఏపనిని స్వీకరించినను క్రమప్రకారము దానిని శీఘ్రముగా కొనసాగింతురు. అట్టివారు భాగ్యము నభిలషించరు. కాని భాగ్యము వారి నిర్లిప్తతను గమనింపకయే వారియింట పడును.

రెండవది యథార్థము. వ్యాపారమునకు సంబంధించిన ప్రతివిషయముననుయథార్థము చాలఅవసరము. క్రమపద్ధతి లేనివాని పని గందరగోళముగా నుండుటచే వానిపని యథార్థమైనది కాజాలదు. కావున మనము ఏ విషయమునగూడ వానిపై ఆధారపడి యుండజాలము. సాధారణముగా యథార్థమనునది తెలిసికొనుట కష్టము. పరిశుద్ధమైన జీవితము, పరిశుద్ధమైన మనస్సు కలవారిదగ్గర నే యథార్థము బయటపడును. కాని వారి సహచరులు కూడ ఆతని యథార్థమును నమ్మజాలరు. విధిప్రకారము నడచువానిపనులు ఎదుటివారికి అనాచారములుగా కనుపించుట సహజము.

యథార్థము పలుకువారిసంఖ్య చాలతక్కువ. సా

ధారణముగ ఒకరు పలుకువానిలో ఒక్కవిషయము యథార్థమున్నను తక్కినవన్నియు అస్వాభావికములై యుండును. వీనినుండియే మోసము, కపటము బయలు దేరును. ఈవిషయమునుగూర్చి తెలియజెప్పుట కష్టము. యథార్థమును మరుగుపరచి యథార్థమువలె కనిపించు నట్లు పల్కుటయే నేడు ఒకనీతిఅయియున్నది. దానిని అను భవముమీాదగాని గుర్తింపజాలము. యథార్థము నను సరించువారు లేకపోలేదుకాని వారు మొదటినుండియు యథార్థమునే నమ్మియున్నారని చెప్పుటకు వీలులేదు. వారు క్రమక్రమముగా యథార్థములోని మూలవిషయ మును గ్రహించి ఈస్థితికి వచ్చియున్నారు.

ఒక్కతప్పైనను చేయనివా డింతవర కెవ్వడును లేడు. కాని తనవిషయమును, తనతప్పులను తెలిసికొని బాగుపడ నభిలషించువాడే ధన్యుడు. తనతప్పును స్వయ ముగ తెలిసికొనలేక ఇతరులు చెప్పినను కోపగించుకొను వాని మనస్సు తప్పుత్రోవలోనున్నదని వేరుగా చెప్ప నక్కరలేదు.

మూడవది ఉపయోగము. ఒకమంచిపనియొక్క ఫలితము అనుభవమునకు వచ్చుటయే ఉపయోగము. కష్టే ఫలే అన్నాడు. ఆకష్టములో క్రమపద్ధతి యుండవలె నని పైనవ్రాయబడినది. అప్పుడే ఎవరికైనను భాగ్యము లభించును. ఆనందము లభించును. కాలము ననుసరించి పంటవేసికొను వానికి ధనము, సుఖము కలుగును. కాల ముగాని కాలములో తొందరపడి పంటవేసికొన్నచో ఉన్నది కూడ ఊడిపోవును.

ఉపయోగమునకై మంచిమార్గమున, సులభమైన మార్గమున బోవలెను. అట్లు పోవువానికి అనవసరమైన ఆలోచనలతో పనిలేదు. గాలిలో మేడలు కట్టరాదు. తనపనియొక్క ఫలితమునే చూచుచుండవలెను. దాని యుపయోగమునే కోరుచుండవలెను.

యథార్థవాదులు పిచ్చినియమముల నేర్పరుచుకొనుటలో కాలము వెళ్ళబుచ్చరు. వారికి కావలసినది పని. అందులో క్రమపద్ధతి. వారుచూచునది ఉపయోగమునకు పనికివచ్చు వస్తువునకు. ఒకడు తన ఆలోచన ననుసరించి పనిచేయును. ఆత డాపనిలో పతనము నొందినను దానిని అంతటితో విడువడు. అతడు యథార్థము నాశించువాడు. కావున అతడు తనపతనమునకు ఆశ్చర్యపడడు.

మానవుని సత్కార్మ అతని యనుచరులకు ఉపయోగముగానుండును. కాని అతడు చెప్పిన నీతులు ఉపయోగముగానుండవు. చక్కగా తయారయిన వస్తువు, మంచి అందమయినఇల్లు, పెద్దయంత్రము, గుణవంతుడు మనకు ఆదర్శప్రాయములుగాని వానిని గురించిన నీతులు కావు. ఆనీతులు పుస్తకములలో వ్రాయబడియున్నవి- సామెతల రూపమున నోళ్ళలో మెలగుచున్నవి.

నాల్గవది గ్రహణశక్తి. చిన్నచిన్న విషయములను, వానినిగూర్చిన నియమములను చక్కగా తెలిసికొనుటయే గ్రహణశక్తి. ఇదియొక సద్గుణము. వ్యాపారి చిన్నచిన్న విషయములను క్రమప్రకారము అర్థముచేసికొని ఒక్కొక్క దానిని ఆచరణలో పెట్టును. ఇట్లే వైజ్ఞానికుడును. కవి అప్పుడపుడు పొడచూపు తన చిన్నచిన్న యాలోచనలను తన

అసలు ఉద్దేశ్యమునకు జేర్చి గొప్ప గ్రంథమును తయారు చేయును. కాబట్టి వివిధములగు చిన్నవిషయముల కూడి కను గుర్తించుటయే గ్రహణశక్తి అనవచ్చును. చిన్నవిష యములు పెక్కు ప్రతిమానవుని హృదయమునను ఇమిడి యే యుండును. అట్లుమనసులో ప్రాపంచకవిషయములను అనేకములను గుప్తపరచుకొన్నవాడే గొప్పవాడు- ఆదర్శ ప్రాయుడు. ప్రతివాడును ఆదర్శప్రాయుడు కాజాలడు. కాని ప్రతివాడును తాను గ్రహించు ప్రతివిషయమును జ్ఞప్తి యందుంచుకొని, గ్రహించిన విషయసహాయమున తన పనిని క్రమప్రకారముగా అభివృద్ధి చేసికొనవచ్చును. అ ట్లభివృద్ధిచేసికొన్నవాడే తెలివిగలవాడగును- బుద్ధిమంతు డగును- భాగ్యవంతుడగును.

ఇప్పటికి భాగ్యసౌధమునకు నాల్గు స్తంభములు పూర్తిఅయినవి. మిగిలిన నాల్గును లేకుండగనే సౌధము నిలువబడగలదు. శక్తి, పొదుపు, శుద్ధి, క్రమపద్ధతి- ఈ లక్షణములు గలవానికి జీవితములో జయముకలుగక తప్పదు. శక్తినిగ్రహముకలవాడై ధనమును, సమయ మును పొదుపుగా వాడగలవాడై, ఆత్మశుద్ధిని బొందిన వాడై, మనసును క్రమపద్ధతిని యలవాటు పరచుకొన్న వానికి ఏకష్టమును గలుగదు. అట్టివానికి సంఘములో మర్యాదకల్గును. అతనికి సర్వము సమానమే. మూర్ఖుని ముఖ మాతడు చూడడు. అతడు బీదవాడైనను సరే, నలుగురిలో పలుకుపడి లేకపోయినను సరే సంఘము అతనిని దిగద్రొక్కలేదు. అతడు ధైర్యముతో నిలువ బడి జీవనసంగ్రామములో గెలుపొందును.

---

౬

# సానుభూతి

భాగ్యసౌధమునకు ఐదవ స్తంభము సానుభూతి.

సానుభూతి అనగా నేమి? పరిమళమును వెదజల్లి రాలిపోవు పుష్పములను, ఏకమాత్రమున వర్షించి యంతరించిపోవు మేఘములను చూచి జాలిచెందుట సానుభూతి కాదు. బంధుమిత్రాదులను విడనాడి వారికై విలపించుటయు సానుభూతి కాదు. ప్రపంచమునంతను తనఆత్మలో నిముడ్చుకొనుటయే సానుభూతి.

ఇంటివద్ద రాక్షసత్వమును వహించినవాడు బయట దయాస్వరూపుడు కాజాలడు. బయట 'భూతదయ'ను చూపించువాని హృదయము మరియొకచోట కఠోరమై యుండదు. ఇంటలేనిదయ బయట పుట్టదు. ఒక మనిషి యొక్క సానుభూతిని తెలిసికొనవలె నన్నచో దానిని అతని పనులనుండియే గ్రహింపవలెను. కేవలము కన్నీటితో సానుభూతిని తెల్పినచో ఆకన్నీరు స్వార్థము అను గుంటలోనుండి పుట్టినదేమో అను అనుమానము పుట్ట వచ్చును. స్వార్థమున కేదియైన నష్టము వచ్చినప్పుడు గూడ కన్నీరు పొంగి బయటపడుట ప్రకృతిసిద్ధమేకదా!

సానుభూతి గంభీరమైనది. వివరింపరానిది. స్వార్థమును మరచిన సద్గుణునకే సానుభూతి అను ప్రేమరసము చిందిపడును. సానుభూతిగలవారు దృఢమనస్కులై, శాంతమూర్తులై, నవ్వుమొగము కలవారై యుందురు.

వారి శాంతము వెలితిమనసుగలవారికి బూటకముగా కనుపించును. కాని కొలదిమంది మాత్రమే వారి సహృదయతను తెలిసికొనగల్గుదురు.

సానుభూతి లేనివారికి స్వార్థ మెక్కువ. ఎంత సేపు తన గొడవయే చెప్పుకొనుచుండును. తనబాధలే తనకు గాని ఇతరుల బాధ లతనికి గొడవగానుండును.

స్వార్థము ప్రపంచజ్ఞానములేమిచే కల్గును. కాని సానుభూతి ప్రేమనుండి జనించును. ప్రేమలో జ్ఞానమున్నది. సానుభూతి గలవానిలో ప్రేమ, జ్ఞానము, ఇచ్ఛ సమముగానుండును. ప్రేమలేనిఇచ్ఛ మోహము. జ్ఞానములేనిప్రేమ మూర్ఖము. మూర్ఖునకు దేవుడు లేడు, దయ్యము లేదు. అట్టివారు తమను తామే గొప్పవారిగా జూచుకొందురు. కాని సానుభూతి గలవానికి అందరు సమానమే. తాను సంఘములో మానవసేవకై జన్మించినట్లు తలంచును. "బాధ వర్ణింపమని రోగిని యడుగను. ఏమియన రోగిని చూచుటతోడనే ఆతనిబాధ నాఅనుభవమునకు అందును." అని ఒక డాక్టరు పల్కియున్నాడు. అట్టిదియే సానుభూతి.

స్వార్థమున్నచోట సానుభూతి నశించును. తన మంచిగుణములను వర్ణించుచు, అందువలన తనకు కల్గిన కష్టములను తెలుపుచు నితరులను దూషించువారు సానుభూతినిగూర్చి ఇంకను నేర్చికొనవలసియున్నది. సానుభూతి కలవాడు తాను ఒక్కడుగనే భావింపజాలడు. దోమ మొదలు బ్రహ్మవరకు తానే యనుకొనును. ప్రతివిషయమును అన్నియుద్దేశ్యములతోను స్వీకరించును కాని ఒకఉద్దే

ముతో కాదు. దీనినే భూతదయ యని మనపెద్దలు నిర్వ చించియున్నారు. భూతదయ యనగా తోడి జీవులకు సేవ జేయుట. సేవచేయుట యనగా తోడ్పడుటగాని దాసీపని చేయుటకాదు.

ఈతత్వమునే "ఆత్మ ఒక్కటే" అని మనవారు పల్కియున్నారు. ఈతత్వమును గ్రహించినప్పుడే ఒకని బాధ మనలనుకూడ పీడించును. ఒకరిసంతోషము మనల నానందపెట్టును. ఒకరిశిక్ష మనల నంధకారములో ముం చును. ఒకరిమూర్ఖత మనకు దుఃఖముకల్పించును.

ఇట్టి సానుభూతి సంపాదించుట కొకడు తన జీవిత ములో నెన్నియో సుఖదుఃఖములకు లోనై యుండవలెను. అప్పుడే వాని కిది యబ్బును. అతని కీ యనుభవములో స్వాభిమానము, అనాలోచన, ఈర్ష్య ఇగిరిపోవును. అనేక కష్టములకు లోనై యున్నవానికి, కొంతకాలమున కాకష్ట ములు బండతేరిపోవును. అతనికి గుండెధైర్య మెక్కువ యగును. ఇతరుల కష్టదశనుచూచి అతడు ధైర్యమునే బోధించును.

ఇట్టిదియే సానుభూతి. అది లేనంతకాలము అతడు కఠినహృదయుడై యుండును. కాని కష్టములలో కడతేరిన పిమ్మట సానుభూతి తలచూపును. అట్లు తలచూపుటతో అతని మనసులోనున్న యుద్రేకము, దుర్మార్గము, స్వార్థ ము క్రమక్రమముగా నతనిని విడచిపోవును. అప్పుడు అతడు ప్రపంచముతో సంబంధము వదలుకొనును. ఇతరు లకు ఉపదేశింపజాలుగురువు అగును.

వ్యాపారస్థుల కీ సానుభూతి తప్పక భాగ్యమును

చేకూర్పగలదు. ప్రతివారును ఈసానుభూతిచే ప్రతివానిని ఆకర్షింపవచ్చును. లోననొకటి పెట్టుకొని బయటకు నవ్వువా రుందురు. కాని అతని యనుచరులు తాత్కాలికముగా అతనిని నమ్మినను, నిజము తెలిసికొనుట కొంత కాలమువరకు కష్టమేఅయినను హృదయము ఆతని నవ్వును కళాహీనముగా చేయుచునే యుండును. అది యాతనికి తెలియదు.

ఒకవ్యాపారి నీతులు బోధించుచున్నను, ఒక ప్రచారకుడు మతమును బోధించుచున్నను, ఎవ్వరైనను తనపనినిగూర్చి కాక ఇతరము లేవి బోధించుచున్నను, ఆ బోధించు విషయములు అతడు తనవృత్తియందే విధముగా నుపయోగించుచున్నాడని ప్రజలు చూచుచునేయుందురు. ఇది స్వాభావికము. ఈదృష్టినుండి వారు తప్పుకొనజాలరు.

ఇతరుల అవస్థలచూచుచు సానుభూతి చూపక నిర్లక్ష్యము చూపువాడే స్వార్థపరుడు. కాని సానుభూతి కలవాడు తాను అవస్థలపాలై యితరులను కాపాడును. స్వార్థమువలన సత్యమైన, శాశ్వతమైన సంతోషములేదు. కాని సానుభూతివలన శాశ్వతమైన, సత్యమైన ఆనందము కలుగును.

అయితే వ్యాపారము నభివృద్ధి చేసికొనదలచువాడు నిస్స్వార్థపరుడై ఎట్లుండగలడు? ప్రతివాడును తనవృత్తిలోనే, తనకు అర్థమైనంతవరకు సానుభూతి చూపవచ్చును. తన వ్యాపారముతోపాటు ప్రక్కదుకాణమువాని వ్యాపారముకూడ వృద్ధిచేయ దలంచువానికి పోనుపోను లాభమెక్కువ యగుచుండును. ఏలఅనగా అతని వాడుక

దారులకు అతనియందు సానుభూతి వి స్తరించి ఏర్పడును. లాభము నాశించి విడిగా వ్యాపారముచేయువానికంటె. పదిదుకాణముల నడుమనుండి వ్యాపారము చేయువానికే లాభ మెక్కువ. ఇది వ్యాపారములోని ముఖ్యసూత్రము. వ్యాపారములో ముఖ్యముగా సంపాదింపవలసినది ప్రజల సానుభూతి. దీనినే ఇంగ్లీషులో గుడ్ విల్ అందురు. ఇది విలువ కట్టరానిది. ఇది సానుభూతివలన సంపాదింప దగినదే.

సానుభూతి కీ క్రింది నాలుగు విషయములు సహాయము చేయును.

౧. ప్రేమ, ౨. ఉదారత, ౩. మర్యాద, ౪. సుజ్ఞానము.

మొదటిది ప్రేమ. పూర్తిగా అల్లిన ప్రేమ ఈనాడు ఉండి రేపు పోవునది కాదు. అప్పుడప్పుడు తాత్కాలికముగా కలుగు ప్రేమ ప్రేమ కాదు. ఉద్రేకములో జనించు ప్రేమ శాశ్వతమైనది కాదు. ప్రతిఫలమును వాంఛించు ప్రేమ గాఢమైనది కాదు. ప్రేమ జీవనమునకు మొదటి మెట్టు. ప్రేమను వెడలగొట్టి హృదయకవాట మెప్పుడు మూసికొనిపోవునో, అప్పుడు మనుజుడు ప్రేమాగారపు వాకిట ప్రాణమువాయును. అలౌకిక సౌందర్యమును దర్శించుచున్నది ప్రేమ. ప్రేమ మానవుని నిర్వైరిగా చేయుచున్నది. ప్రేమమూర్తియే యొకప్పుడు భయంకర రూపమునుదాల్చి దుష్టశిక్షణమునకు, శిష్టరక్షణమునకు బయలుదేరును. ఇట్టివారే మన యవతారమూర్తులు.

రెండవది ఉదారత. ప్రేమ సానుభూతికి చెల్లెలు.

ఉదారత తమ్ముడు. ఉదారుడగువాని హృదయము విశాలముగానుండును అతడందరికి ఆకర్షణీయుడై యుండును. నలుగురిలో పలుకుబడిగలవాడై యుండును.

ఆర్జనతోబాటు త్యాగముకూడ ముఖ్యమైనదే. త్యాగములేనివానికి కలుగనేకలుగదు. ఇది ప్రకృతిధర్మము. త్యాగమునుగూర్చి ప్రతి మతప్రచారకుడును బోధించియేయున్నాడు. దీనివలన స్వార్థమనునది మరుగుపడిపోవును. త్యాగులు సంఘములో అభిమానమును సంపాదింతురు. త్యాగములేనివాడు సంఘమును జూచి భయపడును. దానికి దూరముగా నుండును. అత్యవసరములను కూడ డబ్బు ఖర్చగునను భయమున త్యజించును.

కష్టించి సంపాదించి ధనమును సక్రమముగా ఖర్చుపెట్టువానికంటె ధనమునుగడించి దానిని వాడుట కధికారము వదలుకొన్న లోభిని ధనవంతు డనుటకు వీలుండునా?

విదేశములలో సాధారణముగా ధనవంతులందరు దానధర్మములు చేయువారే. వారిధనము సంఘసేవకును ఉపయోగింపబడును. అట్టివారికే రాబడిఎక్కువ- అట్టివారే కోటీశ్వరులై యున్నారు. మనదేశమునందుకూడ సంఘసేవకై ఖర్చుపెట్టువారే ధనవంతులై యున్నారు. కాని ధనము కూడపెట్టినవారుకాదు. కూడబెట్టినవాడు ధనవంతుడేల కాదందురేమో, అతనికి ఆధనమును ముట్టుకొనుట కధికారములేదు. కావున అతడు 'ధనముగాపున్న దయ్యాలఁ దఱుమువాడు' మాత్రమే. కాబట్టి ఉదారస్వభావులకే త్యాగమబ్బును. వారే జీవితములో విజయ

మందుదురు. వారే స్వతంత్రహృదయులు. వారిచేతులకు గూడ స్వతంత్రమే.

మూఁడవది మర్యాద. మర్యాద అనునది దైవత్వమును బొందిన సద్గుణము. మర్యాద అనుభవముమీఁద గడింపదగినది. మనసు నిలకడమీఁదగాని ఇది యబ్బదు. విషయవాసనలను అణచుకొన్నగాని ఇది లభింపదు. ఈ విధముగా మర్యాదనుపొందినవాఁడే 'పెద్దమనిషి'. 'పెద్దమనిషి'కి అందరును మిత్రులే. అతనికి విరోధు లుండరు. అతని మర్యాదలో జ్ఞాన మిమిడియుండును. అతఁడు కోపము నణచుకొనును. ఇతరులకోపము నెట్లు తగ్గింపవలెనో అతఁడు తెలిసికొనియుండును. మర్యాద తెలియనివారు సాధారణమైన జీవితసమస్యలలో చిక్కుపడి సంఘములో పనికిమాలినవారగుదురు. కాని మర్యాద తెలిసినవారి కీ గందరగోళములు పట్టవు. పట్టినను వారు సులభముగా తప్పుకొందురు.

నాల్గవది సుజ్ఞానము. సానుభూతివలన కల్గునదియే సుజ్ఞానము. సానుభూతిగలవాని మనసు చక్కనిజ్ఞానమును సంపాదించును. అనుభవముమీఁదగాని, వాదనమీఁదగాని యీజ్ఞానము కలుగదు. వాదన విషయమును స్పృశించును. కాని సానుభూతి లోన తరచిచూచును. సానుభూతి లేనివాఁడు వంకెపై టోపీ, కోటు చూచి మనుష్యుఁడు నిలచున్నాఁడని తలంచును. కాని సానుభూతికలవాఁడు మనుష్యుని చూచుచు కోటును, టోపీని గమనింపఁడు.

ప్రేమయొక్క స్వచ్ఛమైన స్వరూపమే సానుభూతి, ఇది మానవహృదయములలో జొరబడి పరీక్షించును.

కాళిదాసు, షేక్సుపియర్లు ఇప్పుడు లేరుకాని వారు వారి పుస్తకరూపముల జీవించియేయున్నారు. వివిధపాత్రలను చిత్రించి వారు వారితోపాటు ఏడ్చిరి- నవ్విరి- ఆడిరి- వారు వారిని తెలిసికొన్నదానికంటె ఈ మహాకవులే వారినిగూర్చి ఎక్కువ తెలిసికొనిరనుటలో వింతలేదు. వారికి పక్షభేదములు లేవు. విరోధము లేదు. వారిసానుభూతి అందరిని ప్రేమించినది.

సానుభూతిగల సుజ్ఞానిఆలోచనలు స్వతంత్రముగా నుండును. అతడు పీల్చుగాలితో ఆనందమును గూడ పీల్చును. అతడు మనుజప్రపంచోద్యానమున నే కాయ గిల్లినను, ఏతీగ లాగినను, ఏపూవు నంటినను ప్రేమరస ధార లొలకును. అతడు మేలుకొనియే ఆనందసామ్రాజ్య మును జూచుచుండును.

---

## ౭
# స హృ ద య త

భాగ్యసౌధమునకు ఆఱవ స్తంభము సహృదయత.

మానవసంఘము మీా సహృదయతవలన కట్టుబడియు న్నది. సహృదయములేనివాడు ప్రపంచమునే విశ్వసింపడు. విశ్వాసములేని జగత్తునకు వినాశనముతప్పదు. పరస్ప రము విశ్వాసపాత్రులుగా నుండుటకే ఈజీవితము నిర్మింప బడియున్నది. మోసమునకు పుట్టినిల్లు వ్యాపారమని కొందరుతలంతురు. వారుకూడ పరస్పరవిశ్వాసముతోడనే

వ్యాపారము కొనసాగించుచున్నారుగదా!

మానవసంఘము సత్యముపై నాధారపడియున్నదని యందఱెరిగినదే! సహృదయత ఉన్నగాని సత్యము అలవడదు. సత్యవంతు లనేకులు పుట్టి యూరుపేరులేక పోయిరి. కాని సత్యము నిలువబడియే యున్నది. ఇది ఈశ్వరనియమము. ఇది ప్రచ్ఛన్నముగా నందరిలో నున్నది.

అవిశ్వాసము కలవానికి ప్రపంచమంతయు మోసముగా కనుపించును. అతడే లోకమును 'పాడులోకము' అనుచు ఉండును. కామెర్లుకలవానికి ప్రపంచమంతయు పచ్చగనే కనుపించునుగదా! మానవసంఘములో మంచిని కనిపెట్టలేనివాడు ముందు తన్నుదా బాగుపరచుకొనవలెను. సంఘము ఒకప్పుడు చెడుగా తిరుగవచ్చును. కాని లోకము దానిని 'మరమ్మతు' చేయుటకు వేచియుండును.

జగన్నాటకమున మనుష్యుడొక పాత్రధారి. ఈజగన్నాటకమున నియమములు ప్రత్యేకములు. ఇందు ఈతనికి వేషములు పనికిరావు. భంగిమములు చెల్లవు. ఈతడు డాంబికము చేయరాదు. లేనిపోనివి తెచ్చిపెట్టుకొనకూడదు. ఈనాటకనియమముల నత డనుసరింపనిచో నతనికి అందులో విజయముచేకూరదు. కీర్తిని పాడుచేసికొనును.

సహృదయుని హృదయము చాల దృఢమైనదై యుండును. గొప్ప తెలివిగలవానికిగూడ హృదయ మింత దృఢముగా నుండదు. సహృదయతను బట్టియే మానవుడు కీర్తివంతుడగును. సహృదయత, సద్గుణము ఈరెంటికిని దగ్గరసంబంధము. ఇందులో నేదితగ్గినను రెండవదికూడ తగ్గిపోవును. ఈ తగ్గుదలతో అవిశ్వాసము ప్రబలును.

అందుతో అసత్యము, దానినుండి మోసము, కపటము వృద్ధియగును. అట్టివాని హృదయకూపమున చీకటితప్ప వెలుతురుండనేయుండదు.

ఒకనినిగూర్చి 'ఈరూపాయి ఇక్కడ చెల్లద'ని పల్కుట మనము వినియేయుందుము. రూపాయిలో కలితీ లేనిచో నెప్పుడైనను, ఎక్కడైనను చెల్లితీరును. ఇట్లే మనుష్యులును. వారి మాటలు, పనులు వారి హృదయమును తేటపరచును. వారి హృదయమునుండి వెలువడు ధ్వని నిర్మలమై ప్రతిహృదయమునందును జొరబడును. వెంటనే వారి మంచిచెడ్డలు తేలిపోవును. చెడుమ్రోత చెవికి వినబడును. అట్లే చెడుగుణము హృదయమునకు తట్టకపోదు. తన్నుతా బొగడుకొనువాడు తన్నుతానే మోసగించుకొనుచుండును. నిజానిజముల నింద్రియములే తెలిసికొనును. ఆత్మకు మాత్రము తెలియకుండునా ?

ఆత్మ సరియైన న్యాయవిచారణగూడ చేయగలదు. ఏవిషయము నుండియైనను చెడునుండి మంచిని, అబద్ధము నుండి నిజమును వేరుచేయగల శక్తి దీనికున్నది. వేలు గ్రంథములనుండి వెలువడు ఉత్తమగ్రంథమును గ్రహించుట-వేలు నీతులుచెప్పు జనసమూహమున ఒక్కని నీతియే చక్కగా పట్టుబడుట ఈ యాత్మవిచారణమువలన కలిగినవే !

డాంబికము చౌకపదార్థము. అనుకరణ మసహ్యమైనది. అనుకరణ నీడవంటిది. అసలైనది. అనగా అనుకరణముకానిది. విలువకలది. అనుకరణము లేనివాడు సామాన్యమానవునికంటె అధికుడు. డాంబికమువలన

వ్యక్తిత్వమే నశించును. స్వతంత్రత గలవానికి జయము తప్పదు. అది శాశ్వతమైనది. స్వతంత్రముగా నుండుటయే మానవుని పరమావధి.

కపటి ప్రపంచమును, ప్రపంచనియమములను మోసపుచ్చజూచును, అతడు మోసపుచ్చగలది తుట్ట తుద కొక్కటియే. అదియే అతని యాత్మ. దానికి అతడు వినాశము తెచ్చిపెట్టుకొనును. అనుకరణమువలన అసలునే త్రిప్పదలంచును. కాని నీడ నీడే, అసలు అసలే. ఆనీడ నిలచుటకుగూడ తావులేదు. అతడు చివరకు ఒంటరిగా విడువబడును. దరిద్రుడగును. అతని జీవితమంతయు కంగారుగానుండును. లోకమునకు భయపడును. జగత్తు ననుమానించును. అతనికి విచార మధికమగును. కాబట్టి ప్రపంచమును నమ్మి సంచరింపక అపనమ్మకమున కలవాటుపడి చెడిపోవువానికి వేరుగా నరకములేదు.

సహృదయత కలవానికి ఈక్రింది నాలుగు సద్గుణములుండును.

౧. సరళత, ౨. ఆకర్షణ, ౩. సూక్ష్మదృష్టి, ౪. శక్తి.

మొదటిది సరళత. సరళత స్వభావసిద్ధమైనది. ప్రకృతిలోని వస్తువులన్నియు సరళములై, స్వచ్ఛములై యుండును. అందువలననే వానిలో హావము, భావము, గానము కూడియుండును. ఆవస్తువు లెట్లున్నవో వానినట్లే చూచుచున్నాము గాని అవి ఎట్లుండదలచెనోయని చూచుటలేదు. మానవసంఘము మినహా ఎచ్చటను మోసమనునది లేదు. పుష్పము అందముగా నుండదలచినచో ఇప్పు

డున్నంత ఆకర్షణీయముగా నుండక యుండునేమో! ప్రకృతిలో మనము చూచుచున్నదంతయు, అసలు ప్రకృతి సౌందర్యమనియే చూచుచున్నాము. ఏవస్తువుకూడ అంతకంటె బాగుగా నుండుటకై సలహా నీయలేకుండ ఉన్నాము. ప్రతివస్తువు తనకుతానే అందముగా కనుపించుచున్నది. ఇందులకు కారణము సరళతయే.

'పల్లెల కరుగుడ'ని ప్రతివారును ఘోషించుచున్నారు. అచ్చట సృష్టిసౌందర్యముల నానందించి సరళతననుకరించుటకేయని తెలిసికొనవలెను. కాని మనతోపాటు పట్టణబద్ధమైన మన బుద్ధులనుకూడ తీసికొనిపోగూడదు. స్వచ్ఛమైన సరళమైన జీవితమును గడపుటకొఱకే పల్లెవాసముగాని బస్తీలలోని పద్ధతుల నచ్చట ప్రవేశపెట్టి ప్రచారము చేయుటకుగాదు.

మానవుడు సరళతనుండియే పైకిలేచినాడు. లేచినకొలది సరళత అన్నివిషయములలోను మృదువుగా నుండవలెను. ఈనియమమును పాటించినవారే మహానుభావులైనారు. కాని వారు ప్రపంచరంగమున వేషభూషణములతో వెలయుచున్నారు. అందువలన వారు సామాన్యమానవులుగనే ఉండిపోవుచున్నారు.

"నేను పోవులోపుగా గొప్పవాడనై పోవలెను" అనువాడెన్నడును గొప్పవాడు కాజాలడు. తాను గొప్పవాడగుచున్నట్లు అనుకొనును- ధనమిచ్చి అనుపించుకొనును కాని తన సర్వస్వమును సంఘమున కర్పించినతప్ప తాను గొప్పవాడు కాజాలడని తెలిసికొనడు. రక్తమును, కన్నీటిని సమర్పించినగాని యతడు గొప్పవాడు కాజాలడు.

ఎట్లో గొప్పవారమనిపించుకొనువారును ఉన్నారు- కాని నిజానిజములు వారికే తెలియును- లోకమునకే తెలియును. సహృదయుడే సరళస్వభావుడగును.

రెండవది ఆకర్షణ. సరళతనుండియే ఈశక్తి వెలువడును. ఇందువలననే ప్రకృతిలో ప్రతివస్తువు ఆకర్షణీయముగా నుండును. మానవులలో ఈ ఆకర్షణమును 'మాన్యత' అనవచ్చును. అనగా సంఘములో గణింపదగినవాడుగా అగుట.

ఈమాన్యత గడించుట కొకతాయెత్తు కనిపెట్టబడినదట. ఈతాయెతును పర్సనల్ మాగ్నటిసమ్ అని అందురు. ఇది విచిత్రమైనదే. వ్యక్తిత్వమును బోగొట్టుకొని, సరళత విడనాడి తంత్రసహాయమున పైకి వేషము వేసికొని తయారగుదొంగ ఒకదానిలో కానిచో మరియొకదానిలోనైనను పట్టుబడగలడు. ముఖము అందమైనది కావచ్చును. శరీరమున కందము తెచ్చి పెట్టుకొనవచ్చును. కాని మనసునకు అందము ఎవ్వడు తేగలడు? గుణమునకు బలమెవ్వడీయగలడు? ఇవి కలిగినవానికే సహృదయత అబ్బును. అతనిదే సరళత. అతని ముఖకాంతి తంత్రసహాయమున మరింత కాంతివంతము కాదు. సహృదయులు తమశక్తిని, అందమును, తమసద్గుణములను గూర్చి తలంపనే తలంపరు. ఏలయన వారు తమ్ముగూర్చి తాము విచారించుకొనరు. ఇతరులచే ఆకర్షింపబడుదురు. ఆ ఇతరుల సహృదయతను, ప్రేమను, మర్యాదను వారు పొందుదురు.

మూడవది సూక్ష్మదృష్టి. పైనకనుబడు నటనల

నన్నిటిని పెగల్చి లోనప్రవేశింపగలదే యీదృష్టి. సహృదయుని చూపు కపటిని తలవంచునట్లు చేయగలదు. అతడు సత్యాసత్యములు సులభముగా తెలిసికొనగలడు- సరళమైన జంతుజాల మేదియో, అపాయకరమైన దేదియో మనము సులభముగా తెలిసికొనజాలినట్లు, అతడు కూడ సంఘములోని మానవుల మంచిచెడ్డలను సులభముగా తెలిసికొనగలడు.

నాల్గవది శక్తి. ఈశక్తి వెనుక వివరించిన శక్తివంటిదికాదు. ఇది దుర్గుణములను తీసివేసి మంచిని అభివృద్ధి చేయగలది. ఈశక్తి వ్యక్తి చచ్చినపిమ్మటకూడ ప్రబలుచునేయుండును. ప్రపంచమంతయు నావరించువరకు అతని శక్తి అంతరింపదు. అట్టిశక్తియే మన యవతారపురుషులకు ఉండినది. వివిధమతగురువులకుగూడ నీశక్తి బాగుగా ఉండినది. అది నేటికిని నిలచియేయున్నది. అవతారపురుషుడు తనశక్తిని ఎల్లప్పుడు ప్రకటింపలేదు. ఏదో ఒక సమయమున ఒక్కనికే వెల్లడిచేసెను. అది ఆనోట ఆనోటపడి నేటికికూడ ప్రజ్వరిల్లుచున్నది.

ఆశక్తియే భాగ్యము. ఈభాగ్యమునకు ధనముతో పనిలేదు. అయినను సహృదయముతో పనిచేయువానికి ధనమునకు లోటుండదు. వేషభూషణములలో, మాటమంచిలో సరళతగలవానికి ధనము నిలువయుండును.

భాగ్యసౌధమున నీ ఆఱవ స్తంభము కట్టగలవానికి శాశ్వతసౌభాగ్యము సిద్ధించును.

---

*

# ౭
# నిష్పక్షపాతము

భాగ్యసౌధమునకు ఏడవ స్తంభము నిష్పక్షపాతము.

అనసూయ దిగ్విజయము నిచ్చునది. ఆరోగ్యము, విజయము, ఆనందము, భాగ్యము వీనికి అడ్డముగా నిలచునదియే అసూయ. అది లేనినాడు ఊహాలో పుట్టిన విరోధులుకూడ మిత్రులుగా కనుపింతురు. అసూయకలవాని జీవితమొక పరుగుపందెమువంటిది. అతనికి అంతుదొరకదు. అనసూయగలవానికి మాత్రము ఈ పరుగు బలము కూర్చునదిగా కనుపించును. అందులో నతని కానందమబ్బును.

నిష్పక్షపాతమును అలవఱచుకొనుటకై, ఒకడు తనయెదుటి చెడువస్తువులను తీసివైచుకొని అన్నిటిని సమానముగా చూచుట నేర్చుకొనవలెను. ఇట్లు నేర్చుకొనినవాడు పర్వతములనే తీసివేయగలడు కాని అసూయాపరుడు తనహృదయమునందే పెద్ద పర్వతపంక్తిని తయారుచేసికొనును. దానికి ఆవలనేమియు లేదనియే యతడు తలంచుచుండును. ఈపర్వతశ్రేణిని తీసివేయగలుగుచో దానివెనుక విశాలరమ్యప్రదేశము కనుపించును. అసూయను తీసివేయలేకపోయినచో, ఎంతయో సంతోషము ఇగిరిపోవును, ఎందరో మిత్రులు తప్పిపోదురు, ఎంతయో ఆనంద మారిపోవును, ఎంతయోభాగ్య మడుగంటును!

అసూయలో స్వాతంత్ర్య మెన్నటికిని కలుగదు. కొందరు తాముపట్టినపట్టుపై అనసూయతోనుందురు. దానికై వాదింతురు. ఒకరి యాలోచన పాటింపరు. ఇట్లే తమ జీవితములో తాము ప్రేమించిన ప్రతి విషయముపైన అనసూయజూపినచో, అది అసూయగాక మరేమగును? తమయాలోచన లర్థములేనివియైనను వారు ఇతరులు చెప్పినవి విశ్వసింపరు. ఇట్టివారి హృదయములు విశాలములు కావు. వారిబుద్ధులు వికసింపవు. వారు ఎల్లప్పుడును చీకటిలోనే మునిగియుందురు. వారు సంఘమునకు వెలియై యుందురు. అసూయాపరులు క్రొత్తవెలుగును జూడరు. వారికి క్రొత్త అందము గిట్టదు. తామే వెలుతురులో నున్నట్లు తక్కిన ప్రపంచమంతయు చీకటిలోనున్నట్లు తలంతురు.

ఈ మానవసంఘము తర్క వితర్కములలోబడి యుంటచే రెండుపార్టీలుగా చీలియున్నది. ఎవరి మతము వారిదే- ఎవరి నీతివారిదే- ఎవరి తత్త్వమువారిదే- ఈ పార్టీలకు సర్వసమభావమునుగూర్చు వారెవరు? ప్రకృతి ఈరెండుపార్టీలను కొంతవరకు సమముగా చేయుచున్నది. బుద్ధివికాసము లేనివారికి బుద్ధినిచ్చుచున్నది. అందరిని ఒకే త్రోవలో బెట్టుచున్నది. ఆత్రోవయే సత్యము. అందులో నిష్పక్షపాత మిమిడియున్నది. నిష్పక్షపాతము పరిపూర్ణమైనది. కాని అసూయాపరుడు సగముమాత్రమేచూచి అంతయు నింతే యనుకొనును. నిష్పక్షపాతిమాత్రము అంతయు గ్రహించును. కాబట్టి సత్యమును కొంచెము కొంచెముగా చూచుట మంచిది. క్రమక్రమముగా నాత్రోవనే

పోయి పూర్తిచేయవచ్చును. అట్లు పూర్తి అయినప్పుడే నిష్పక్షపాతము పూర్తియగును. అట్లు పూర్తి చేసినవారు లేకపోలేదు. వారు సంఘములో గొప్పమర్యాదను సంపాదించుకొన్నారు, సంపాదించుకొనుచున్నారు. వారు కడు దరిద్రులైనను సరే, కులహీనులైనను సరే ప్రపంచములో సగముమంది వారిని పూజింపక తప్పదు. నేడు మనము పూజించు అవతారపురుషు లిట్లు నిష్పక్షపాతమును వహించినవారని వేరుగా వ్రాయనక్కరలేదు. అవతారపురుషులేకాదు, గొప్పరచయితలుగూడ నిష్పక్షపాతముగల వారే. వారిహృదయవైశాల్యము ప్రపంచమును దాటి యున్నది. వారి యాలోచనలు భూతలముపై మూలమూలకు బోవును. కాని తమ్ముగురించి మాత్రము కాదు.

నిష్పక్షపాతములో నీక్రిందినాలుగు భాగములున్నవి.

౧. న్యాయము, ౨. సహనము, ౩. నిదానము, ౪. జ్ఞానము.

మొదటిది న్యాయము. సమానమైన విలువగలవి ఇచ్చిపుచ్చుకొనుటయే న్యాయము. 'మంచి బేరము తగిలినది' అని చెప్పుట దొంగతనమువంటిది. అనగా తక్కువగానిచ్చి ఎక్కువగా బుచ్చుకొన్నాడన్నమాట. న్యాయదృష్టికలవాడు ఎన్నడు ఎక్కువ కాజేయదలంపడు. అతడు స్వలాభమును చూచుకొనడు. ఏలయనగా న్యాయమే తుదకు అతనికి తెచ్చిపెట్టునను ధైర్యమతనికి గలదు. అతనిదే ధర్మము. ధర్మము సనాతనము. సజీవమైనది. సర్వభూతములకు మధుప్రాయము. ధర్మము స్వాభావికము.

బేరమునకు చోటిచ్చువ్యాపారము మంచిదికాదు.

సరియైనధరలు నిర్ణయించి వస్తువునకు సరిగా ధనము పుచ్చుకొన్న వ్యాపారి తప్పక అభివృద్ధిలోనికి రాగలడు. మంచివస్తువులను సరియైనధరకు అమ్ముటవలన ప్రజల విశ్వాసమును సంపాదింపగలడు. ఈవిశ్వాసమునకు విలువయే లేదు. ఒకవ్యాపారి మరియొకవ్యాపారిని పడగొట్ట జూచుట, అతనివ్యాపారమునకే మొప్పము దెచ్చికొనుట యని తెలిసికొనవలెను. వ్యాపారి తన ఖాతాదారులను దగాజేయదలంచుకొన్నచో కొంతకాలమునకు తన విజయమును తానే కూలద్రోసికొన్నవాడగును.

న్యాయముగా నిచ్చువాడుకూడ ఎక్కువ ఇచ్చుచున్నట్లు తలంపరాదు. దానిలో ధర్మమును ఆతడు విచారింపవలెను. అతడు తక్కువఇచ్చినచో 'పీనాసి' యనిపించుకొనును. పీనాసివాని హృదయ మెప్పుడును ఆందోళనలో పడియుండును. దమ్మిడీఖర్చయిన నేడ్వ మొదలిడును. ధన మన్యాయముగా లభించిన ఆనందించును. అతడు బంధుమిత్రాదులనే దొంగలవలె జూచును. ఎవ్వరిని నమ్మడు. తన్ను తానే నమ్ముకొనడు. ధనము నిలువచేయును. కాని దానిని ముట్టుకొనుట కతనికి అధికారముండదు. తుదకు 'చీమలు పెట్టినపుట్టలు పాములకిరువైన' యట్లగును– ఈవిధముగా నేడు నూటికి తొంబది జరుగుచున్నవి.

రెండవది సహనము. నిష్పత్తిపాతమునకు సహనములేక ఓర్మి అనునది ఒక ఆభరణము. ఏదో ఒకవిషయమున ఓర్మియుండుటకాదు, అన్నివిషయములందీసహనముండవలెను. ఏమాత్రము సహనమున్నను మానవుడు తనజీవితములో విచిత్రములు చేయగలడు.

సహనము లేనివానికి ఇతరుల సలహాకూడ కఠిన ముగానుండును. ఇతరుల నవ్వు అతనిని అనుమానసముద్ర ములో పడవేయును. అతనినిగూర్చినచర్చ అతని మనసును పీడించును. అతడు సంఘమునకు దూరముగానే యుం డును. అయినను అతని హృదయమున కగ్నితగులుకొనియే యుండును. ప్రపంచమును చూచినకొలది అతనిహృద యము తేలికయై ఎండుటాకువలె అనుమానముఅను సుడి గాలిలో ఎగురుచుండును. ఎప్పుడును నరముల బలహీనత, హృద్రోగము లతనిని పీడించును. అట్టివాడు నిగ్రహము నలవాటు చేసికొనవలెను. శక్తియున్నచో అతడు తన సద్గు ణముల నభివృద్ధిచేసికొని 'సహనము'ను గూర్చిన గాథ లను చదువుచుండవలెను. ఇతరులనుగూర్చి ఆలోచించుచు, వారిమంచికై తాను అవస్థలపాలు కావలెను. అప్పుడే సహనమబ్బును. అభిప్రాయభేదము కలవానితో మాట్లా డునప్పుడు హృదయమును శాంతిపరచుకొనవలెను. అభి ప్రాయభేదము లుండుట సహజము. అది మనస్సును కద లించును- కాని అప్పుడే సహనముండవలెను. అప్పుడే అతని హృదయము విశాలమగును. మనస్సు మెరుగు తేరును. తిట్టుట, ఉమియుట మొదలగునవి అబ్బుట సుల భము- ఇవి గుణమును వెలితిపరచును- మంచి యలవర చుకొనుటయే కష్టము-

మూడవది నిదానము. సహనముతో నున్నదియే నిదానము. ఇది ప్రతిమానవుని కుండవలసిన సద్గుణము. క్రోధసాగరమును దాటిన పిమ్మట ప్రశాంతమగు స్వర్గ మును బొందుటయే నిదానము. అవస్థలపడి, కష్టముల

కోర్చి, అనుభవమును సంపాదించినపిదప జయించు సామ్రాజ్యమే నిదానము. నిదానములేనివాడు నిష్పక్షపాతి కాజాలడు. ఉద్రేకము, కపటము, పక్షపాతము ఇవి కోప సముద్రముయొక్క ఉత్తుంగతరంగములు. అతనిని దూషించిన అవి మరింత హెచ్చగును.

నిదానముకలవాడు దూషణభూషణములలో చిక్కుపడడు. తన్ను తానెట్లు తలంచుకొనునో, ఇతరులగూడ నట్లే తలంచును. తనపని ముఖ్యమనుకొన్నచో, ఇతరుల పనికూడ అంత ముఖ్యమనుకొనును. సహనముకలవానికి ఆత్మానందమే కాదు, తన శక్తులనన్నిటిని తనచేతిలో నాడింపగల శక్తి యుండును. అతని హృదయమున కామక్రోధాదులన్నియు చల్లబడియుండును. తర్కవితర్కములు సమానమైయుండును. అతడేపనిని చేసినను చక్కగా శాంతముతో నెరవేర్పగలడు.

నిదానమునకు నిర్లక్ష్యముజేరిన నంతయు బాడుచేయును. నిదానము సజీవమైనది. నిర్లక్ష్యము నిర్జీవమైనది. నిదానము తన్ను తా జయించుకొన్నది. కనుకనే ఇతరములనుగూడ సులభముగా జయింపగలదు. పనిబట్టినప్పుడే నిదానమున్నచో కొంతవరకు నష్టమేకాని అపజయము మాత్రము కలుగదు. ఇంద్రియనిగ్రహము నిదానము భాగ్యము వీనికన్న సౌభాగ్యమును గూర్చునది.

నాల్గవది జ్ఞానము. జ్ఞానము నిష్పక్షపాతమునకు తోడు. జ్ఞానమే మానవుని బంటు— అతని కవచము— అదియే అతనిని భాగ్యసౌధమునకు పల్లకిలో నూరేగించుచు ఆనందముతో తీసికొనిపోవును.

సుజ్ఞాని ఇతరులకు ఉపయోగముగా నిలువబడును. వారి మంచికొరకు పనిచేయును. అయినను నైతికనియమములను విడువడు.

జ్ఞానములో మేధాశక్తి యున్నది. ప్రపంచములోని ఎంతచిన్న విషయమునైనను ఈశక్తి గ్రహింపగలదు. పెద్దదిగా ఉన్నంతమాత్రమున చిన్నవానిని విడువదు. తెలివిగలవాని హృదయము ప్రపంచమువంటిది. అందులో అన్నివిషయములును వానివాని స్థలములలో అమర్చబడి యుండును. జ్ఞానికి బయటసహాయమే అక్కరలేదు. అతడు జ్ఞానమను శిఖరముపై దృఢముగా నిలువబడియుండును' జ్ఞానము ఆతని మనసులోనుండి వచ్చినదిగనుక అన్నియు దానికి తెలిసియేయున్నవి. కష్టసుఖముల ననుభవించి శాంతించియున్నది గనుక కష్టసుఖములకు మరల శాంతము, సహనము జూపగలదు.

జ్ఞానము మనుష్యునికి అలవడినప్పుడు ఆతనిశక్తి యధికమగును. ఆతనికంటికి ఒకక్రొత్త ప్రపంచము కనుపించును. అతడు సరియైన మోక్షమును చూచుచునే యుండును. అట్టివాడే మన వేదాంతులు చెప్పుకొను 'జ్ఞాని'.

---

## ౯ ఆత్మవిశ్వాసము

భాగ్యసౌధమునకు ఎనిమిదవ స్తంభము ఆత్మవిశ్వాసము.

ఆత్మవిశ్వాసమన్న ఆత్మస్తుతియని మాత్ర మర్థము

చేసికొనకుడు. మొదటిదాని కేదియు అధమముగా కనుపించదు. రెండవదాని కేదియు గొప్పగా కనుపింపదు. ప్రతియువకునకు జీవితములో మొదట సంభవించునది ఆత్మదురభిమానము, ఆత్మస్తుతి. అతనికి తెలియని దానిని గూర్చి ప్రశ్నించినచో తెలియదనుటకు బదులు ఊహించి తెలిసినట్లు మాట్లాడును. కాని మనస్ఫూర్తిగా తెలియదని ఒప్పుకొనుట ఆత్మగౌరవమును గూర్చును. ఆత్మదురభిమాని పిరికివాడు. అతనికి జీవితమన్న భయము. ఈభయములో చేయరాని పనులుచేసి నిందలపాలగును.

ఆత్మవిశ్వాసముగలవాడు తనయాత్మనే నమ్ముకొని యుండును గాని సేవకునివలె ఒకరివెంటబడడు. అపనిందలతనిని యంటవు. ఎంద రతనిని దూషించినను వానిలోని సత్యాసత్యము లతడు గ్రహించును. అవి యాతని నిర్మల హృదయమున జేరవు. కాని ప్రతిహృదయమునకును దెబ్బలు తగులుట సహజము. అప్పు డాహృదయములు మరింత దృఢములై యుండి జీవితయుద్ధములో విజయమునుగాంచును. అట్టివారే వీరులు. కొంతకాలమునకు ఆదేశములోని జనులందరును వారి ననుకరింతురు. వారిని భగవదంశసంభూతులుగా నెంతురు.

ఈకారణముచేతనే మనము పూజించు యవతార పురుషులందరు ఆకాలమున అపనిందలపాలై యున్నను నేటికి దేవతాపురుషులుగ గమనింపబడుచున్నారు. వారు వారికి అప్పుడు కల్గిన నష్టములను సహింపజాలక తిరిగి పోయి ఉండినచో వారు నేడు అవతారపురుషులుగ గణింపబడకయే యుండియుండురు. వారు అప్పుడు దృఢ

మనస్కులై యుండిరి కనుకనే విజయమందిరి.

గర్వము, స్వార్థము ఆత్మవిశ్వాసములో చేరవు. మానవుని గర్వము, స్వార్థము క్రిందికి త్రోయును. ఆత్మ విశ్వాసము మానవుని లేపును. ఆస్తి, ధనము, పదవి, దుస్తులు మొదలగువానితో గర్వము పెరుగును. అవి తగ్గి పోయిననాడు గర్వము, స్వార్థము నాశనమగును. నిర్మల త్వము, సహృదయత, సద్గుణము, సత్యము వీనిపై ఆత్మ విశ్వాసము ఆధారపడియుండును. ఏచిన్ని కారణముచేత గాని పై వానిలో నేదిపోయినను విశ్వాసము దృఢముగా నుండుటచే తిరిగి యభివృద్ధి కాగలదు. గర్వము సాధా రణముగా తన తెలివితక్కువతనమును కప్పిపుచ్చుకొను టకు ప్రయత్నించును. ఈరోజున మితముతప్పిన గర్వము రేపు పతనమునొందక మానదు.

ఆత్మవిశ్వాసమునకు కప్పిపుచ్చుట కేమియులేదు. ప్రతి విషయమును తెలిసికొనుటకు సిద్ధముగానుండును. గర్వమునకు నమ్రతలేదు. కాని ఆత్మవిశ్వాసమునకు నమ్రత దగ్గరబంధువు. ఆత్మవిశ్వాసముగల యోగికంటె దర్పముతో వెలుగుచున్న మహారాజకుమారుడు సుఖ వంతుడు కాడు.

బుద్ధు డిట్లు పల్కియున్నాడు : ‘తమ యాత్మను నమ్ముకొని ఎవ్వరు తమలోని దీపమొసంగు కాంతివలన ముందునకు నడతురో, ఆత్మయొసంగు సత్యప్రబోధము నాలకింతురో అట్టివారే ఉన్నతపదవి బొందగలరు. కాని వారింకను జ్ఞాన మభివృద్ధిపరచుకొనుటకు సిద్ధపడియుండ వలెను.’ పిచ్చిపోకడల నిమిడియుండక ఆత్మవిశ్వాసము

కల్గియుండవలయుననియు, జ్ఞానార్జనమున తృప్తియుండ గూడదనియు వాని యుద్దేశ్యమని దీనివలన తెలియు చున్నది.

ఆత్మవిశ్వాసము వీరత్వమునకు మూలము. మహా పురుషులందరు ఆత్మవిశ్వాసము గలవారే- వారే మనకు గురువులై యున్నారు. వా రెవరిమీదను "ఆధారపడియుండ లేదు. ఈ ప్రపంచమంతయు వారిమీదనే యాధారపడి యున్నది.

మనదీపమును వెలిగించుకొనుట కశ్రద్ధచేసి ఇతరుల దీపముపై నాధారపడియున్నచో ఎప్పటికైనను మనము చీకటిలో పడిపోవుట నిజము.'మనదీపమే' ఆత్మవిశ్వాసము. నాపై నేనే యాధారపడుటకు నేను బీదవాడను- చిన్న వాడను అని ఒకడు సమాధాన మీయవచ్చును. కాని అతడు తనకు తగిన ఆధారముమీద నిలువగలిగినప్పుడే అది పెద్దదికాగలదు. చిన్నతనమున ఒకని యభివృద్ధికై అతని పెద్దలు భగవంతుని ప్రార్థింతురు. అతడు చేతు లాడించుట మొదలుపెట్టిన తరువాత ఆభారమును అతని మీదనే వైతురు. అట్టిదే ఇదియును.

సాధారణముగా ప్రతివానికి ఉండునది ఆత్మఅవిశ్వా సము. ఒకడు తన్ను తా కీటకముగా తలంచుకొన్నచో ఆతనివలన నితరులేమి నేర్చికొనగలరు? నిజముగా తనలో నేదియైనను లోపమున్నదని తెలిసికొనగల్గినచో దానిని నిర్మూలము కావించుకొనుటకు యత్నింపవలెగాని సంఘ ములో పనికిమాలినవానిగా నెంచుకొనగూడదు. ఈ స్థితి లో కొందరు అతివినయమును జూపుదురు, అందులకు

గర్వింతురు. ఇది ధూర్తలక్షణము. తనలోని లోపము చేత పడిపోయినచో, లేవదీయుటకై ఇతరుల సహాయము కోరవచ్చును. లేచినపిదప మరింత జాగ్రత్తతో తనత్రోవను పోవచ్చును.

ఆత్మవిశ్వాసమున క్రింది నాలుగును తోడ్పడగలవు.

౧. నిర్ణయము, ౨. దృఢశక్తి, 3. పదవి, ౪. స్వాతంత్ర్యము.

మొదటిది నిర్ణయము. నిర్ణయము మనుష్యుని బలవంతునిగా జేయును. ఏదియు నిర్ణయింపజాలనివాడు సంఘమునకు పనికిమాలిన యంగము. అతనిపనిలో అతనికెన్ని యనుమానములువచ్చినను సరే, ఆతనిశక్తిని మాత్రము అనుమానించుకొనరాదు. జీవితనాటకములో ఆతని భాగ మతనికి బాగుగ తెలిసియుండవలెను. తా నితరులకు చెప్పలేకపోవచ్చును కాని తనకుతాను సమాధానము చెప్పుకొనగలిగి యుండవలెను. తన్ను తా నమ్ముకొనని వానిని ఎవరు నమ్ముదురు? తన సామానుల విషయము వివరములు తెలిసికొనని వ్యాపారియొక్క వాణిజ్య మెట్లభివృద్ధిజెందును? తనసంగతి తనకే తెలియనిచో, ఆతనికి ఎవ్వరు బోధింపగలరు?

ఆత్మవిశ్వాసముతో చేసినదే నిజమైన నిర్ణయము. నిర్ణయమును దృఢపరచుటకు సత్య మవసరము. సత్యము లేనంతకాలము నిర్ణయము ఊగులాడుచునే యుండును. వెంటనే నిర్ణయము చేయలేనివాని జీవితమే ఊగులాడు చుండును.

కొందరు తప్పుచేతుమేమోయని ఒకనిర్ణయమునకు

రాజాలరు. ఆలోచనలోను, పనిలోను తొందరగలవారు తప్పుచేయుదురు కాని దృఢమైన సంకల్పముతో పనిచేయువారు సాధారణముగ తప్పుచేయజాలరు. ఒకప్పుడు చేసినను అంతప్రమాదము ఉండజాలదు. కావున మొదటనే అపనమ్మకముతో పనికిదిగి చెడగొట్టకూడదు. మొదటి తప్పు తప్పేకాని రెండవతప్పులో బలహీనముకూడ చేరియున్నది. పనినిగూర్చి అతనిని ప్రశ్నించినప్పుడు ఔను కాదు అను నిర్ణయము వెంటనే చెప్పగల్గియుండవలెను. కాని ఈరెంటను చెప్పజాలనిచో అతడు బలహీనుడనియే చెప్పవలెను.

దృఢమైన సంకల్పముండవలెను. నిర్ణయముచేసికొని పనికి దిగవలెను. పని సులభముగా సానుకూలము కాగలదు.

రెండవది దృఢశక్తి. నిర్ణయశక్తిగలవాని హృదయమునుండియే దృఢసంకల్పశక్తి జనించును. ఇది సద్గుణము కలవానికే యలవడును. అట్టివాడు తన హృదయమునకు దాసుడై పనిచేయును- దృఢమైన పునాదిపై నిలువబడును. శారీరకబలముండుటచే క్రూరుడగువాడు మానుషత్వమును విడనాడి క్రూరుడగువానికంటె మంచివాడే. మంచిచెడ్డలను నిర్ణయించు బలముకలవాడు త్రాగుబోతైనను సరే, క్రూరుడైనను సరే మానాభిమానములను విడచి క్రూరుడగువానికంటె సుఖము ననుభవింపగలడు. అట్లు నిర్ణయింపగల శక్తియే కావలసినది. అందువలననే పెద్ద అపరాధములొనర్చినవారుకూడ పెద్ద యోగులైనారు.

మూడవది పదవి. దృఢసంకల్పశక్తిగలవానికి పదవి

(హోదా) ఒక భూషణమువంటిది. పదవి ఉద్యోగమున గాదు, మానవసంఘములో పలుకుబడి సంపాదించుట. ఇది యొకపదవి. సత్యాసత్యములు, న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు నిర్ణయింపగలుగునప్పుడే అతనికి ఆపదవి లభించును. అందతనికి శాంతి కుదురును. అతడు సంఘములో నున్నంతసేపు సంఘములో శాంతి ప్రజ్వరిల్లును. అతని శాంతమైన చూపువలన నెట్టి యోధుడైనను ఆయుధములను క్రిందబెట్టవలసినదే. ఈశక్తికలవారు పెద్ద పులిని సైతము నిలువబెట్టకలిగిరని మనము విని యేయు న్నాము. ఇట్టిదియే మెస్మరిజం- ఇదియే సమ్మోహనాస్త్ర ము. శస్త్రవిద్యలో నిమిడియున్న దీ దృఢసంకల్పశక్తియే.

ఆత్మత్యాగమువలననే పదవి అబ్బును. న్యాయాధి కారి తన్నుతా మరచి తనకార్యమును నిష్పక్షపాతముతో నెరవేర్చును. అతడు ధర్మమునకు మాత్రమే కట్టు బడును. న్యాయవిచారణలో నతడు స్వార్థమును జూచు కొన్నచో నాపదవిలో నుండజాలడు.

దీక్షవహించి కార్యమున కుపక్రమించుటయే మన విధి. విధిలో సత్కర్మము నాచరించుటకు మనకు స్వతం త్రముకలదు. కర్మఫలమునుగూర్చి ప్రాకులాడుట తప్పు. ఫలమును సంపాదించు సత్కర్మము నాచరించుటచే ఫలము దానియంత అదియేవచ్చును. ఫలము కొరకు దేవు లాడుటచే కర్మము నాచరించుటలో లోటగుచున్నది. కావున ఫలము దూరమగుచున్నది.

మానవునకు బ్రతికియున్నంతకాలము ప్రయత్నము తప్పదు. ప్రయత్నములు ఫలించుచో అతనికి భూమియే

స్వర్గము. కాని అవి ఫలింపవు. కారణము బాగుగా నూహించినచో ఫలాపేక్షచే ప్రయత్నము మరుగుపడినదని తెలియగలదు. ఫలము దైవాధీనము. అది త్రికరణశుద్ధి కలవానికే ఇయ్యబడును.

ప్రయత్నమునగల ఆసక్తి ఫలపరిత్యాగమున కూడ ఉండవలెను. ఇదియే గీతలోని సూత్రము. ఈనియమము అర్థముకానినాడే మానవుడు తాను చెడి ప్రపంచమును దూషించుచున్నాడు. ప్రపంచము ఎల్లప్పుడు మంచిదే. కాలము సర్వదా మంచినే యిచ్చుచుండును. కాని మానవుడు తనబుద్ధిహీనతచే వీనికి మంచిచెడ్డలు ఆరోపించుచున్నాడు.

మానవుడు ఈప్రపంచమును ఒక చిల్లరదుకాణమువలె భావించుచున్నాడు. ఎంతవరకు ఇదిగో పుచ్చుకొనుము—తెమ్ము. ఈవ్యాపారములోనే యతడు చితికిపోవుచున్నాడు. ఈజాలమునుండి తప్పించుకొనుటకై మన పెద్దలు "నిష్కామకర్మ" యని ఒక్కమాటలో మనకు బుద్ధులు నేర్పియున్నారు.

నాల్గవది స్వాతంత్ర్యము. స్వాతంత్ర్యము దృఢమైన నియమములుగల మానవుని హక్కు. స్వాతంత్ర్యముకొరకు ప్రతివాడును కొట్టుకొనుచునే యున్నాడు. ఆత్మస్వాతంత్ర్యముననే మానవుడు జీవించుచున్నాడు. అతడు మానవసేవకై నడుముకట్టుకొని ప్రపంచరంగమున నిలచినాడు. ఒకరిపై ఆధారపడి సేవచేయుచున్నప్పుడు అది సేవయనిపించుకొనదు. అది దాసీపని యనిపించుకొనును. స్వాతంత్ర్యము, స్వేచ్ఛ ఇవి సత్కర్మమువలననే కలుగును.

కాని సోమరితనమునగాదు. ఆత్మవిశ్వాసి సోమరిగానుండడు. కష్టపడి పనిచేయును. భాగ్యము, పేదరికము వీనితో నతనికి పనిలేదు. సోమరితనమున కలవాటుపడిన భాగ్యవంతుని అతడు క్షమింపడు. సోమరులైన ఆభాగ్యవంతులే కార్యరంగమున దుముకవలెనని ఆత డనును.

ఇందుతో భాగ్యసౌధమునకు ఎనిమిది స్తంభములు పూర్తియైనవి.

## ౧౦

## ఉ ద్ఘా ట న ము

ఇప్పటికి భాగ్యసౌధమున కెనిమిది స్తంభములను గట్టితిమి. స్తంభములు బలముగానుండుటకు తగు పదార్థములుకూడ కలిపితిమి. ఈ స్తంభముల పై కప్పు నిర్మించి పిదప సౌధము నలంకరించి దీవించుచు ఉద్ఘాటనము కావింతము.

ధనమును గూడబెట్టుట, వ్యాపారమును వృద్ధి జేయుట మొదలగు భాగ్యోన్నతికి మార్గములను ఇంతవరకు ఈగ్రంథమున చదివినవారు ఇందు చిన్నచిన్న విషయములు పెక్కు వదలివేయబడినవని తెలిసికొందురు. ఇందులకు కారణము లేకపోలేదు. చిన్నవిషయములు స్వంతముగా నిలువలేవు. ఇతర జీవితనియమములతో బాటు సూక్ష్మముగా గ్రహింపగల్గినగాని ఈచిన్నవిషయములు విమర్శనీయములు, స్పృహణీయములు కాజాలవు. చిన్నవిషయము లనేకములు. కాని పెద్దనియమములు కొలదిగానుం

డును. వీనికి మార్పులు లేవు. కాబట్టి తరచుగా మార్పులను బొందు చిన్నవిషయములబట్టి శాశ్వతములు, స్థూలములు అయిన నియమములను మార్పజాలము. ఒక్కొక్క మనుష్యునిబట్టి ఒక్కొక్క చిన్నవిషయము మారవచ్చును. కాని జీవితనియమ మొక్కటియేగదా! చక్కని నియమముల నలవరచుకొనువానికి చిన్నచిన్న విషయములతో పనియేయుండదు. సరియైన నియమపద్ధతిలో లేనివాడు అనేకములగు చిన్నవిషయములలో చిక్కుకొని మహారణ్యములో దారితప్పినవానివలె కొట్టుకొనును. అగుటనే చిన్నవిషయముల నిందు అవలోడింపలేదు.

చిన్నవిషయములు అక్షరములవంటివి. కాని నియమములు ఆత్మవంటివి. మానవశరీర మనేకములగు భాగములచే నిర్మింపబడియున్నది. కాని దాని ముఖ్యభాగము ఆత్మ. అట్లే వ్యాపారముకూడ ఒక శరీరమువంటిది. దీని పద్ధతియొక్కటే. దీనిలో ననేకములగు చిన్నవిషయములిమిడియున్నవి.

ప్రతిమానవుని దైనికచర్యలో ఏదో ఒక చిన్నకారణమున అతనిమనస్సు విచారమగ్నమగును. అల్పకారణమున చలించుట కలవాటుపడినమనస్సు కొంతకాలమునకు అతనిని అవస్థలపాలు చేయును- అంతియే కాదు- ఆత్మహత్యకుగూడ దింపును. అతడు తుదకు జీవితమనెడి రత్నహారమును మృత్యుసుందరి మెడలో వైచి ఆమెనుకూడ కురూపిగా జేయును. కాని దృఢమనస్కులు తమ జీవితము నానందపరచుకొనుటయే పరమార్థమని తలంతురు.

మనస్సు చలించుటకుగల కారణములను నాలుగు విధములుగా విభజింపవచ్చును.

౧. తమ్ము తా పూర్తిగా అర్థముచేసికొనకపోవుట, ౨. తమతో జోక్యము కల్పించుకొనువారిని అర్థముచేసికొనకపోవుట, 3. ధనమునకు దాసుడగుట, ర. కర్మజ్ఞానము నందు పరిపూర్ణజ్ఞానము లేకుండుట.

౧. తన్ను తా నర్థముచేసికొనుటకు మానవుడు తన జ్ఞానశక్తుల నభివృద్ధిచేసికొనవలెను. సంఘము ననుసరించి సంచరింపవలెను. తనయాత్మ ప్రబోధమును చెవియొగ్గి వినుచుండవలెను. దుర్మార్గుల స్నేహమును వదలివేయవలెను. అతని దుర్మార్గ మాతని మహారణ్యములకు ఈడ్చుకొనిపోవునని తెలిసికొనవలెను. ఇతరు లాతనికి వ్యతిరేకముగా సంచరించుట ఆతని మనోదౌర్బల్యము, కల్మష మేయని తలంపవలెను. కాని ఇతరులు మూర్ఖులని వారిని నిందింపరాదు.

ప్రతివాని మనసునందును స్వతంత్రాలోచనలు కలవు. ఆ యాలోచనలకు జన్మస్థానమును కనిపెట్టుట అతని విధి. 'విల్, ఇంటలెక్టు' ఆలోచనలకు జన్మస్థానములు. వీనిని కనిపెట్టలేనిచో మానవుడు తన ఇచ్చవచ్చినట్లు చేయుచుండును. అందువలన నతనికి మంచిచెడ్డలు నిర్ణయింపగల శక్తి క్రమక్రమముగా తగ్గిపోవును. ఈశక్తి తగ్గినకొలది అతని యాలోచనలు తరంగములవలె పొంగి యాతనిని ఏనాటికైనను నడిసముద్రములో పడవేయును. అచ్చట అతని 'విల్, ఇంటలెక్టులు' పనిచేయవు. గడ్డిపరకనైనను బట్టుకొని బ్రతుకదలంచును. ఈస్థితిలో నాతనిని ముంచుటకు టక్కరిమిత్రులు అనేకులు చేరుదురు. కాబట్టి

ఆలోచించి ఏపనికైనను ఉపక్రమింపవలెను.

౨. తమతో జోక్యముకల్పించుకొనువారిని అర్థముచేసికొనుట యొకకళ అనవచ్చును. ఏమనుష్యుని దగ్గర ఎట్లు సంచరింపవలెనో తెలిసికొని ఆవిధముగా సంచరించు కళాజ్ఞానులు ఈరోజులలో చాలమందిగలరు. కాని వారి నైజగుణ మెప్పటికైనను బయటపడకపోదు. వ్యభిచారిదగ్గర వేదాంతమును కప్పిపుచ్చి, రౌడీదగ్గర ధర్మశాస్త్రమును మరుగుపరచి మాట్లాడువాడు సమయమువచ్చినప్పుడు పట్టుబడును. ఇట్టివానికి సాధారణముగా నుండు లక్షణము 'కొండెములు చెప్పుట.' అనగా ఇక్కడ మాట లక్కడచెప్పుట. ఒకడు మరియొకనితో నెందులకు స్నేహముచేయ యత్నించుచున్నాడో తెలిసికొనగల్గినచో ఎవ్వరైనను ముందుగనే జాగ్రతపడవచ్చును.

రెండు సమానతత్త్వములు గల మనుష్యులు మాట్లాడునప్పుడు అభిప్రాయభేదము లుండవు. సమానతత్త్వములు లేనివారి కభిప్రాయభేదము లుండునని వ్రాయనక్కరలేదు. అట్టివారి స్నేహ మెక్కువకాల ముండదు. ఉండకపోవుటవలన చింతింప నవసరమేలేదు. చింతించినచో నయ్యది విరోధముక్రింద మారిపోవును.

సమానతత్త్వము గలవారిలో అభిప్రాయభేదము లున్నచో, పరస్పరము సంభాషించికొని తమతమ హృదయముల నెరుకపరుపవలెనేగాని వారి తగాదా తీర్చుట కెవ్వరునుజాలరు. ఆభేదమును మనసులో దాచియుంచినచో నది మురిగిపోయి విరోధముగా మారును.

3. ఒకడు ధనమునకు దాసు డగుటవలన కలుగు

కష్టములను వర్ణింప నవసరములేదు. నేడు మనము చదువు గాథలన్నియు దీనికి సంబంధించిన వే.

ధనమనగా పెద్ద మొత్తమనియేకాదు. చిల్లరైనను సరే! ఒక దమ్మిడీవిషయములోనైనను ఒకరి కీయవలసిన మరువరాదు. తాను పుచ్చుకొనవలసినచో, తన మిత్రుడు తనంతతానే ఈయలేదు కావున దొంగ అనుటకు బదులు- మరచిపోయెనని తలంచి అతనిని అడుగుట మంచిది. ఇందువలన మనసులోని చింత తగ్గిపోవును. కాబట్టి మానవుడు ఎంతవరకును చింతలను దూరముగా తరుమ యత్నింపవలెనేగాని వానిని పెంచ యత్నింపరాదు.

౮. మన దేశములో కర్మయోగము తెలియనివాడు లేడు. ఎగిరినంతవర కెగిరి క్రిందబడినప్పుడు 'పురాకృతకర్మ' యని ఒక్కమాటలో అంతయు నెగురగొట్టుట మనకు అలవాటు అయినది. సాహిత్యముగూడ ఈవాదమునే పోషించుచున్నది. ఇట్లే ఇప్పుడు చేయు పాపములకు ఫలము 'ముందుజన్మ'కు త్రోసివేయుచున్నారు. ఈవాదన మానవ జాతిని మంచిత్రోవలో పెట్టుచున్నదో లేదో తెలియదు. ఈవాదములోపడి కొట్టుకొనుటకంటె 'నిన్న చేసిన తప్పునకు ఈదినమే అనుభవింతుము' అని చెప్పినచో నెక్కుడుగ లాభముండునేమో! మానవు లిన్నితప్పులు చేయకుందు రేమో!

నిజముగా నాలోచించినచో నేడు నూటికి తొంబదివరకు ఇట్లే జరుగుచున్నవి. మానవుడు తనకర్మఫలమును చాలవర కిక్కడనే అనుభవించుచున్నాడనవచ్చును.

పైన వివరించినవన్నియు చిన్నవిషయములు. ఈ

చిన్నవిషయములను తప్పకొనక పోవుటచే మానవుని భాగ్యసౌధము బీటువారుచున్నది. వాని జీవితములో చింత లనేకము లుత్పన్నము లగుచున్నవి.

భాగ్యమను స్థూలదేహమున కుండవలసినది సౌభాగ్యమను సూక్ష్మశరీరము. ఇది నైతికజీవనమువలననే కల్గును. భాగ్యమనునది మొట్టమొదట హృదయములో పుట్టిన దే- నైతికశక్తి బయటకు ధనరూపముగా కనుపించుచున్నది. కాని ఆనంద మెట్లు లభించును? అది లేనినాడు భాగ్య మెట్లబ్బును? కవియై వేయిపుస్తకములు తయారుచేయ వచ్చునుగాని హృదయనైర్మల్యము లేనిదే దానివలన నాతనికి సంతోషముండదు.

ధనములోగాని, భాగ్యములోగాని సుఖములేదు. ఇవి సజీవమైనవికావు. ఆనందమే మహాభాగ్యము. ఆనందమే మానవుని పరమావధి. ఆనందమనుభవించుటకు మానవుడు శక్తిగలవాడై యుండవలెను. ఆనందమునుగూర్చి విషయము లతనిని ఆవరించియుండవలెనేగాని వాని వెంట నతడు పరుగిడరాదు.

స్వర్గమున లేని మంచిలేదు. 'ఆస్వర్గమే నీహృదయములోనున్నది.' నిర్మలత్వము, దయ, సుఖము, ధార్మికత్వమును బొందిన భాగ్యవంతులే ఆనందమూర్తులై యున్నారు. ఆనందమునకై ధనమును గడింపదలంచినవా రెన్నడు సుఖంపనేలేదు. సుఖంపదలచినవారికి సుఖము ప్రాప్తించుకొరకై భాగ్యసౌధమును ఎనిమిది స్తంభములపై నిర్మించియున్నాము. ఈ స్తంభములపై నిలిపిన సౌధము బలముకలదికాక మరేదియగును?

ఇప్పుడు నిర్ణయింపదగిన విషయము భాగ్యసౌధము నకు సౌందర్యమెట్లబ్బును అనునది. సౌందర్య మనగా నేమి? దుస్తులు, ఆభరణములు వీనికంటె సౌందర్యముకలది మఱి ఏదియో యున్నదని పాఠకులీవరకే ఊహించియుందురు.

మానవునకు జ్ఞానము సౌందర్యము కావచ్చును. ప్రతి మానవునకు ఏదో విషయములో జ్ఞానమనునది ఉన్నదికదా-కాని అతనికి ఆ తేజస్సు ఉన్నదా? లేదు- ఎవరి జ్ఞానము వారిది- రచనలో, గానములో, లలితకళలలో, శాస్త్రములో, వాణిజ్యములో, దొంగతనములో, టక్కరితనములో, వంటలో పరిపూర్ణజ్ఞానమును సంపాదించిన వారున్నారు. ఇవియన్నియు ఒకేమాదిరి సౌందర్యమును గూర్చుచున్నవా? కాబట్టి జ్ఞానమనునదికూడ సౌందర్యము నీయజాలదేమోయని సందేహము పుట్టుచున్నది.

పోనీ బ్రహ్మజ్ఞానమే అసలైన సౌందర్య మనుకొందము. కాని మాయావాదుల తత్త్వము వేరు. ఈరెంటిని పట్టుకొని ఎన్నిసంవత్సరములు దేవులాడినను తేదకు అజ్ఞానముతప్ప ఏమియు కలుగదు. ఇక నిట్టివారికి సౌందర్య మెట్లుకలుగును? భాగ్యసౌధములోని నియమములు పఠించినంత మాత్రమున పరమార్థమైన సౌందర్యము దాని యంతనదియే కల్గునా? నమ్మకములేదు. పుస్తకములు చదివి ఈత నేర్చికొనునట్లగును. ముఖ్యముగా కావలసినది ఆచరణ. జ్ఞానమునకు ఆచరణమునకు సంబంధములేదు. ఆచరణలేని విద్వాంసునకు గౌరవముండదు. సౌందర్యముండదు.

మానవుడు మంచి నడవడికలవాడై యుండవలెను.

ఈపుస్తకములోని నియమములు క్రియారూపమున నెప్పుడు పరిణమించునో అప్పుడే భాగ్యసౌధము పరమార్థమైన సౌందర్యముతో విరాజిల్లును.

ఒక్కొక్కని సౌభాగ్యము పడిపోవుచున్నదనుకొనుడు. అప్పుడు ఏ స్తంభము బలహీనముగానున్నదో తెలిసికొనుటయే తెలివితేటలు. అది తెలిసికొనినచో బాగుచేసికొనుట కప్పుడే అవకాశముకల్గును.

క్రొత్తగా భాగ్యసౌధమును కట్టదలంచువారు మంచి ముహూర్తములో నెమ్మదిగా ప్రారంభింపవలెను. మంచి ఇటికలనుజూచి సున్నముతో గట్టిగా కట్టనేర్చికొనవలెను. కాని పూర్తిగా కట్టుకొన్న పిదప భవనము కంటికి కనుబడదు. హృదయములోనే ఇమిడియుండును. కాని స్థూలశరీర మాయానందభవనములోనే నివశించుచుండును. ఈభవనమును కట్టుటకు పనిముట్లతో బనిలేదు. జీవితములో చక్కని యనుభవమును సంపాదించినజాలును.

పాఠకమహాశయులారా! సద్గుణమును అలవఱచుకొనుడు. జీవనసౌధమును లేపుడు. భాగ్యమహాసౌధమును తయారుచేయుడు. దుర్మార్గములకు లోనై పడిపోవువానిని గూర్చి విచారింపకుడు. సత్కార్యమకై శాంతమును వహింపుడు. జీవితమునకు ఆనందకిరీటమును బెట్టుడు. మీకు కావలసిన పరికరములనన్నిటి నిచ్చియున్నాము. చక్కని భాగ్యసౌధమునుగట్టి దానికి జిరాయువుబోసి దానిలో విలాసముగా, మహానందముతో కాలముగడుపుడు. మీ కందరకును సౌభాగ్య మబ్బునుగాక !

ఆంధ్రభూమి ముద్రణాలయము—వేపేరి, మదరాసు.

# స్వవిషయము

నేడు ప్రపంచము నన్నివిధముల నుజ్జ్రృంభితలూగించుచుమా, ప్రతి దేశమందలి నిత్యజీవనమందు విపరీతమగు మార్పులజేయుచూ నవీన పరిణామమునకు దారిచూపుచున్న నూతన భావ పరంపరలనూ, భారతదేశమందు ఆర్థిక రాజకీయ మతసాంఘికముగను, భాషా విషయకముగను జరుగుచున్న మార్పులనూ, యాంధ్ర పాఠక లోకమునకు చిన్న పుస్తకముల రూపమున సమర్పించుటయే మా యాశయము. మఱియు 'ఆంధ్ర సాహితీ దీపిక' యను పేరుతో, నాంధ్ర భాషయందలి యత్యుత్తమ గ్రంథముల నూఱింటిని, 'ఆంధ్ర పురాణము' లను పేర అష్టాదశ పురాణములు వచన రూపమునను, 'ఆంధ్రమత దీపిక' యను పేర ప్రపంచమందలి గూవన్మతముల సుఱించి పుస్తకములను క్రమపద్ధతిని గ్రంథమాల (Series) గా ప్రకటించుటయు మా సంకల్పము. వాణిజ్యము, పరిశ్రమలు, కళలు, మహా పురుష జీవితములుకూడ ప్రకటింపబడును. ప్రతి నెలకు రెండు పుస్తకములచొప్పునగాని, రెండు నెలలకు నాల్గు పుస్తకములుగాని ప్రచురింపబడును. మాచే ప్రకటింపబడు ప్రతి పుస్తకము—డబుల్ క్రౌను ౧/౧౬ సైజున ౧౨౪ పేజిలలో, ౨౪ పౌనుల రఫ్ కాగితముతో నుండును. నయనానందకరమగు బైండింగు చేయబడును. ఇంకను మంచి కాగితము లుపయోగించుటకు యత్నములు జరుగుచున్నవి. పుస్తక మొకటింటికి ఆఱు అణాలు వెల ఏర్పరుపబడినది. ఒక సంవత్సరమునకు పైన జెప్పిన విధమున, ప్రకటింపబడు ౨౪ గ్రంథముల ఖరీదు మొత్తము రూ.౯/-లగును. ఒకే సారి ముందుగా రూ. ౬/- లు పంపించువారికి పుస్తకములన్నియు నేరుగా పంపబడును. ఇంకను రూ. ౨/- లధికముగా యిచ్చువారికి, పుస్తకములన్నియు, ౩౦ పౌనుల బెంగాల్ ఆంటిక్ (Bengal antique) కాగితముల మీద ప్రత్యేకముగా ముద్రింపించి సప్లయి చేయబడును. సంవత్సర చందాదారుల కుపయోగించు దరఖాస్తు ఫారము నింకుతో పంపించుచున్నాము.

ఆంధ్ర మహాశయులెల్లరు, మా పుస్తకముల హెచ్చుగ నుపయోగించి మా యీ సంకల్పమును జయప్రదమొనర్చుటకు సాయము చేసెద రని నమ్ముచున్నాము.

నమ్మాళ్వార్స్, పోస్టుబాక్సు ౨౫౧, మద్రాసు.

# మెసర్సు
# నమ్మాళ్వార్సు కంపెనీవారికి,

పోస్టుబాక్సు ౨౪౧, మద్రాసు.

ఆర్యులారా !

మీరు ప్రచురించు గ్రంథములన్నియు (అనగా సంవత్సరమునకు ౨౪ గ్రంథములు) మాకు క్రమముగా సప్లయి చేయవలెనని కోరుచున్నాము. సంవత్సర చందా రూ. ౭/౯/- (ఏడు/తొమ్మిది రూపాయలు) మీకు యీ దినం మని యార్డరు/ పోస్టలు యార్డరు/చెక్కు ద్వారా పంపించినాము. చేరగనే రశీదు పంపించవలెను * [మీ ప్రకటన ప్రకారం రెండు రూపాయలు అధికముగ పంపించినాము గనుక మాకు ఆంటిక్ కాగితపు సంపుటములు పంపించవలెను.] మా అడ్రెసు వివరములు యీ దిగువ యీయబడినవి.

చిత్తగించవలెను,

* రు. ౭ /లు మాత్రమే పంపువారు దీనిని కొట్టివేయవలెను.

పుస్తకముల పంపించుటకు మా అడ్రెసు :

..................................................

..................................................

..................................................

..................................................

# "జెరాడ్" రేడియోలు

ఉత్తమమగు కార్య నిర్వాహణము.



కని విని యెఱుగని అందము, స్వచ్ఛమగు శబ్దము. దూరదూర ప్రదేశములనుండి వినుట కవకాశము. గృహమున కలంకార ప్రాయము మొదలగు గుణము లన్నియు ౧౯౩౮-వ సం॥ మైన 'చాలెంజర్' రేడియోలయందు దొరకును.

మోడల్ ౯౦౩ T. తొమ్మిదివాల్వ్యూలు ఏ. సి. మరియు డి. సి. మూడుబ్యాండులు. ఖరీదు రూ. ౪౯౦/—

## జనరల్ ప్రాడెక్ట్సు కంపెనీ,

౭-ఏ, బ్రాడ్వే, మద్రాసు.

# ప్రజాభిప్రాయములు

'ఒక జాతియొక్క గౌరవం తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను నిలబెట్టుకోవడంలోనే వుంది. ఆ పూనికను నిలిపి దేశ గౌరవం కోసం ముందడుగు వేయించగల ప్రోత్సాహం ప్రతి వారికి కావాలి. ఈ గ్రంథాలు కొంతవరకా శక్తి నియ్యగలవు.'—కృష్ణాపత్రిక.

"అందరికి అందుబాటులోయుండే ఇంత చౌక ధరకు పుస్తకాలను ఇవ్వదలచినవారిని అన్నివిధాల ప్రోత్సహించడము తెలుగువారి విధి"—ప్రజామిత్ర.

"అందమైన గెటప్"—గోల్కొండ పత్రిక.

"ప్రకాశకులు ఇంతచవుకగా పుస్తకాన్ని ఆంధ్రులకు అందజేసినందులకు అభినందనములు. పుస్తకం చక్కగా అచ్చువేయబడింది. చూడటానికి చాలా అందంగా ఉంది. ఆంధ్రులీప్రకాశకులను ఆదరించుతారని నమ్ముచున్నాము."—వాహిని.

# నమ్మాళ్వార్స్ ప్రచురణములు

'ఇట్టి గ్రంథమును ప్రకటించినందులకు ఇట్టివానినింకను ప్రకటింప నుద్యమించుచున్నందులకు నమ్మాళ్వార్లకు ఆంధ్రులు కృతజ్ఞులు.'—ఆంధ్రపత్రిక.

'జనసామాన్యమునకు సులభముగ బోధపడు శైలిలో ఉద్గ్రంథ పఠనకు నిట్టి గ్రంథములే దోహద మొసగగలవు. ........ ఇట్టి గ్రంథముల ప్రకటించినందులకు 'నమ్మాళ్వార్స్' ప్రజలమన్ననలకు పాత్రులగుటలో విపరీతమేమి?' గృహలక్ష్మి.

'నమ్మాళ్వార్స్ గ్రంథముల కూర్పుతీర్పులు ముచ్చటగా తయారు చేయబడుచున్నవి. వీరి ప్రచురణమునుబట్టి మంచిమంచి పుస్తకములు తయారు కానున్నట్లు గ్రహించుచున్నాము. ఈ యుద్యమము లోకప్రీతికరముగా నడువవలయునని కోరుచు, వారిపూనికను అభినందించుచున్నాము.''—ఆంధ్ర వారపత్రిక.

'మద్రాసునందలి నమ్మాళ్వార్స్ కంపెనీవారు యిప్పుడు విజ్ఞానదాయకములగు గ్రంథముల ప్రచురణకు పూనుకొని ఆంధ్ర ప్రజాసంఘము కృతజ్ఞతకు పాల్పడుచున్నారు''--ఆంధ్రభూమి.

'శ్రీనమ్మాళ్వారు గారు యువకులు ......వ్యుత్పన్నులు .. స్వయముగ ఆంగ్లాంధ్ర సంస్కృతములలో తగినంతకృషి చేసి, బహు గ్రంథావలోడనము చేసినారు .......సమయమునకు దగినట్టియు శాశ్వతముగ బ్రతియింటనుండ దగినట్టియు గ్రంథముల ప్రకటించినారు ఏభాషలోను నింతసుందరముగ నచ్చొత్తించిన గ్రంథములింతవరకు వెలువడకలేదనిన నతిశయోక్తిగాదేమో''—వాసవి.

సశేషం.

# స్పెయిన్ దుస్థితి

గ్రంథకర్త — వెల ఆరు అణాలు.

ప్రతాప రామసుబ్బయ్య. — పోస్టేజి రెండు అణాలు.

"స్పెయినుగురించి గతసంవత్సరమున్నరనుండి జరుగుతూ వున్న ప్రజాసంగ్రామమునుగురించి తెలిసికోవాలంటే ఈ గ్రంథం తప్పక చదివితీరాలి"—'వాహిని'

...జర్మనీ యిటలీదేశములెట్లు స్వతంత్రము పన్నుచున్నది మొదలగు విషయములు తేటతెల్లముగా ప్రతి సామాన్యుని కర్థమగునట్లు సామాన్యభాషయందు వ్రాసియున్నది.—'దక్షిణ వైశ్య'.

"వీరికి స్పెయిన్ స్థితిగురించి, ఆ దేశపు అంతర్యుద్ధాన్ని మతవైషమ్యాన్ని గురించి, సమగ్రమైన జ్ఞానంవుంది. ఈ విషయ పరిజ్ఞానమే వీరిని యీ పుస్తకాన్ని వ్రాసేందుకు ప్రోత్సహించిందని కూడా నిస్సంకోచంగా చెప్పొచ్చు."—'గోలకొండ'.

స్పెయిన్‌లోని జమీందారీ విధానమే అక్కడి సాంఘిక అశాంతికి కారణము.................. తటస్థవిధానమను పేరుతో బ్రిటన్ ఫ్రాన్సు లోనగు ప్రభుత్వములు అప్రత్యక్షముగ ఫ్రాంకోకు ఎట్లు సహాయపడుచున్నవో గ్రంథకర్తగారు విశ్లేషముగ దేల్చియున్నారు.—గృహలక్ష్మి.

నమ్మాళ్వార్స్ — ౨౧, స్ట్రింగర్ ముత్యాలమొదలి వీధి. — మద్రాసు

# స్పెయిన్ దుస్థితి

'నేడు స్పెయినులో యేర్పడ్డ ప్రధానసమస్య అభివృద్ధియా, లేక వికృత స్వరూపముదాల్చిన ప్రతిఘాతమా? శాంతియు విజ్ఞానమా? లేక అనాగరకతా మృత్యువా? స్వల్పవ్యత్యాసంతో స్పెయిను, భారతవర్షము ఒక గాడిలోవున్న కారణముచేత మనకు స్పెయిను ప్రజలయందు సానుభూతి యుండవలసిన అవసరమెంతైనాయుంది'—భారతి

'కార్మికకర్షకోద్యమములలో బాల్గొనుచున్న మన యువతీయువకుల కత్యుపయోగకారి యని నమ్ముచున్నాము. వారొకింత శ్రమచేసి, తమతమ యూళ్ల యందలి కార్మికులను కర్షకులను రావించి వారికీ గ్రంథమందలి వృత్తాంతమును సవిస్తరముగా నెఱిగించి ముందుముందు మనలనుకూడ తప్పక కలవరపెట్టుచున్న యా ఫాసిస్టుసిద్ధాంతములు గురాగతములు వారికి చెప్పియుంచుట మంచిదని హెచ్చరించుచున్నాము.'—ఆంధ్రపత్రిక

'అనేక యింగ్లీషు పుస్తకముల చదివినగాని బోధపడని యెన్నియో రాజకీయ విషయములిందు సులభముగ నర్థమగు పద్ధతిని చిత్రితములైనవి'—వాసవి

"ఇలాటి గ్రంథాలే నిజంగా కావాలీ రోజులలో"

కృష్ణా పత్రిక

నమ్మాళ్వార్స్ పోస్టు బాక్సు ౨౫౧, మద్రాసు

# చీనా జపాను ప్రళయము

'చీనాజపాను మధ్య ప్రస్తుతం చెలరేగుతున్న యుద్ధం పుట్టు పూర్వోత్తరాల్ని వివరంగా తెలుపుతుందీ గ్రంథం. దీనిలో ఎంతైనా భోగట్టావుంది.'—ప్రజామిత్ర.

# ప్రకటన

మా పుస్తకములను ప్రతి గ్రామమందును విక్రయించగల విద్యావంతులు, సమర్థులునగు యువకులు ప్రతినిధులు కావలయును. మంచి కమీషన్ ఇవ్వబడును.

మద్రాసులోనుండు పుస్తములు దేనినైనను మీకు సప్లయి చేయగలము. ఇంకను లండన్, న్యూయార్క్, కలకత్తా పట్టణములందు ప్రకటింపబడు గొప్ప గొప్ప గ్రంథములకు కూడా ప్రాతినిధ్యము కలదు.

# గ్రంథకర్తలకు

మీ గ్రంథములు అచ్చుపడుటకు కావలసిన సహాయము లను మేము చేయగలము. సలహా లివ్వగలము.

మీ గ్రంథములు, తెలుగు దేశమంతటను విక్రయించుటకు సహాయము చేయగలము.

ముద్రితా ముద్రిత గ్రంథముల వివరములతో వ్రాయవలెను.

వివరములకు :—

**నమ్మాళ్వార్స్** పోస్టుబాక్సు ౨౫౧, **మద్రాసు.**

# శశాంక

'వెంకటచలంగారుకూడ యీ రచనా సాధనంలో ఆ పద్యం జ్యోతిలోని సత్యాన్ని అవగాహన చేసికొన్నాడంటే అతిశయోక్తి కాదు.........చలంగారి గ్రంథాలన్ని ఒకయెత్తు 'శశాంక' ఒకటి ఒకయెత్తు.............నాటకంగా...చక్కని శైలి రస పిపాసులకు అమూల్యమైనభిక్ష'—భారతి.

'బృహస్పతి విశాలభావంవల్ల అసలు తారాశశాంకం గాథలోవుండే బూతు అంతాపోయి ఈ గ్రంథంలో, అన్న ఈడేరిన తన చెల్లెలివద్ద, భర్త పూజ్యురాలైన తనభార్యవద్ద, కొడుకు పతివ్రతామతల్లి అయిన తనతల్లివద్ద నిరభ్యంతరంగా చదువవచ్చును......... '.........శశాంక వ్రాసిన కలంతో మనంతో మరికొన్ని గ్రంథాలు వెంకటచలంగారువ్రాస్తే భాషా పోషకంగా వుంటుంది"—ఆంధ్రభూమి.

'కథావస్తువు ప్రాతదైనప్పటికిని నూత్నపద్ధతి సమన్వయము చేసి ఆధునికుల కమందానందము గొల్పునట్లు రచించినది' వాసవి.

"ఇంతవరకు గ్రంథకర్తకు వుండే కళంకాన్ని చాలవరకు పోగొట్టి ఆంధ్ర సారస్వతంలో అపూర్వ పాత్రలపట్టికి మరికొందరిని చేర్చింది. భారత సంఘ మంతా ఏకగ్రీవంగా నీతిబాహ్యమన్న కథ నే తీసుకొని అందులోనే అనురాధవంటి పాత్రను సృష్టించడమూ, యుగ యుగాలనుండి పనికిమాలిన వాళ్లలో ప్రథమునిగా లెక్కపెట్టబడిన బృహస్పతికి నిజమైన దివ్యత్వం చేకూర్చ డమూ శశాంకలోని అద్భుత గుణాలు. గ్రంథకర్త కథాంశాలు వేరే ఎత్తుకుని, ఇటువంటి సృష్టి నింకా చేస్తే ఎంతో బాగుంటుంది"—గృహలక్ష్మి.

సశేషం.

# మావద్ద దొరకు గ్రంథములు.

---

**1. ఆ[illegible] 4**

ధార్మిక కర్షక చరితముల తెలుపు
కథల సంపుటి. వెల ౬ అ.

**2. యౌవనజ్వాల**

మృదు మధుర శైలిని వ్రాయ
బడిన ఖండకావ్యము. వెల ౧౨ అ.

**3. శ్రీమదాంధ్ర మహాభారతము**

ఆదిసభారణ్య విరాటోద్యోగ
పర్వములు-937 పేజీలు-డెమ్మి
సైజు-క్యాలికో బైండింగు-చక్కని
కూర్పు. వెల రూ. ౨-౮-౦

**4. భగవద్గీత**

రావుసాహెబు బచ్చు పాపయ్య
శ్రేష్ఠిచే - ప్రతి శ్లోక భావము
తెనుగు పద్యరూపమున వ్రాయ
బడినది. “పద్యములు మృదు
మధుర శైలిలో వ్రాయబడినవి.”
‘ఆంధ్ర పత్రిక’-376 పేజీలు. [illegible] ౬ అ.

The Jupiter Press, Madras